# ఇవాన్ ఇలిచ్ మృతి

## టాల్‌స్టాయ్

అనువాదం:

బెల్లంకొండ రామదాసు



దేశికవితా మండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ '57
వెల: రూపాయి
దేశీప్రెస్, విజయవాడ

---

సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

# ఇవాన్ ఇలిచ్ మృతి

విశాలంగా ఉన్న కోర్టుభవనంలో మెల్విన్స్కీ కేసు విచారణ జరుగుతోంది. మధ్య విశ్రాంతిసమయంలో పబ్లిక్ ప్రాసిక్యూటరూ, లాయర్లూ ఇవాన్ ఇగొరొవిచ్ షెబెక్ ప్రైవేటురూమ్‌లో కలుసుకున్నారు. ప్రఖ్యాతమైన క్రాసోవిస్కీ కేసునుగురించి సంభాషించుకుంటున్నారు. ఫెడార్ వాసిలివిచ్ ఇది తమకు సంబంధించిన విషయం కాదన్నాడు. ఇవాన్ ఇగొరొవిచ్ తమకు సంబంధించిందే అన్నాడు. పీటర్ ఇవానోవిచ్ చర్చలో పాల్గొనకుండా కొత్తగావచ్చిన గెజెట్ చూస్తూ కూచున్నాడు. చదువుతున్నవాడల్లా ఆగి, 'ఈ విషయం విన్నారా? ఇవాన్ ఇలిచ్ చనిపోయాడు' అన్నాడు.

'నిజంగా!' _ అందరూ ఆశ్చర్యపోయారు. 'గెజెట్‌లో పడింది. మీరే చదువుకోండి.' ఫెడార్ వాసిలివిచ్‌కి గెజెట్ అందించాడు. ఇవాన్ ఇలిచ్ మృతి బార్డర్ కట్టివేశారు. 'ప్రాస్కోవ్యా ఫెడొరొవ్నా గొలోవినా బంధుమిత్రులందరికీ, తన భర్త ఇవాన్ ఇలిచ్ గొలొవిన్ మృతి తెలియచెయ్యడానికి ఎంతో విచారిస్తున్నది. శుక్రవారం మధ్యాహ్నం ఒంటిగంటకు శ్రాద్ధకర్మ జరగగలదు.'

అక్కడ సమావేశమైన పెద్దలందరికీ ఇవాన్ ఇలిచ్ సహచరుడు. అతనంటే అందరికి అభిమానం కూడా. కొన్ని వారాలనుంచి అతనికి జబ్బుగా ఉంది. జబ్బు నయంకాదని కూడా డాక్టర్లు చెప్పారు. అతను ఒకవేళ చనిపోతే ఆ పదవి

అలెగ్జీవ్‌కు వస్తుందనుకున్నారు. అలెగ్జీవ్ కాకపోతే విన్నికోవ్‌కు కాని ష్టబెవ్‌కుకానివస్తుందనుకున్నారు. ఇవాన్ ఇలిచ్ మృతి తెలియగానే అక్కడున్న అందరి మనస్సుల్లో ఒక్కటే భావం మెరిసింది - వారికి దాని ఫలితంగా ఎలాటి ప్రమోషన్లు, మార్పులు వస్తాయా అని.

'నాకు తప్పకుండా ష్టబెల్ స్థానం వస్తుంది. లేదా, విన్నికోవ్ స్థానం వస్తుంది' అనుకున్నాడు. ఫెడార్ వాసిలీవిచ్, 'నాకు చాలా కాలంబట్టి ఆ స్థానం ఇస్తామని వాగ్దానం చేస్తున్నారు. ప్రమోషన్ దొరికిందంటే ఎలవెన్సు భత్యాలు కాక, సంవత్సరానికి మరో 800 రూబుళ్ళు దొరుకుతాయి' అన్నాడు.

'అయితే, ఇప్పుడు నా బావమరది ట్రాన్స్ఫర్ కోసం అప్లికేషన్ పెట్టాలి. నా భార్యకూడా సంతోషిస్తుంది. నేను బంధువులకు సహాయం చెయ్యనని నన్ను సాధించడం మానేస్తుంది' అనుకున్నాడు పీటర్ ఇవానొవిచ్, 'నేననుకుంటూనే ఉన్నాను, అతనింక పక్కమీదినుంచి లేవడని. పాపం!' అన్నాడు పీటర్ ఇవనొవిచ్ బిగ్గరగా.

'అసలు జబ్బేమిటో?' 'డాక్టర్లకుకూడా అర్థం కాలేదు. తలా ఒక జబ్బు పేరు చెప్పారు. నేను చివరసారి చూచినప్పుడు. కొంచెం నయంగానే ఉంది.'

'సెలవులిచ్చినప్పటినుంచీ ఒకసారివెళ్ళి చూచివద్దామనుకుంటున్నాను. కాని వీలుకలగలా'

'అతనికి ఆస్తి ఏమైనా ఉందా?'

'భార్యకు కొద్దిగా ఉందనుకుంటాను. అయినా, అంతా చెప్పుకోతగిందికాదు.'

'మనం వెళ్ళి ఆమెను చూడాలి. కాని చాలాదూరం.'

'మీ ఊరికి అన్నీ దూరమే' నగరంలోని పేటలకున్న దూరాలను గురించి కాసేపు చర్చించుకున్నారు. తరువాత కోర్టుకు వెళ్ళారు.

ట్రాన్స్ఫర్లూ ప్రమోషన్లూ కాక, ఇవాన్ ఇలిచ్ మృతి అందరిలోనూ మరో సంతృప్తి కలగచేసింది, అతను పోయినా మేము బ్రతికే ఉన్నాంకదా' అని.

ప్రతిఒకడూ ఇలాగే అనుకున్నాడు. ఇవాన్ ఇలిచ్ ఆప్తమిత్రులు కొందరు. 'శ్రాద్ధ కర్మలకు వెళ్ళి అతని భార్యకు మనం ఓదార్పు తెలపాలి. ఎందుకొచ్చిందిరా ఈ గొడవ' అనుకున్నారు.

ఫెడార్ వాసిలివిచ్, పీటర్ ఇవనొవిచ్ అతనికి దగ్గర వాళ్ళు. పీటర్ ఇవాన్ ఇలిచ్తో కలిసి లా చదువుకున్నాడు.

ఇంటికి వెళ్ళిన తరువాత భోజనసమయంలో ఇవాన్ ఇలిచ్ మృతినిగురించి భార్యకు చెప్పాడు. తన బావమరదిని ట్రాన్స్ఫర్ చేయించడానికి వీలుంటుందన్నాడు. భోజనం కాగానే, సాయంకాలపు దుస్తులు ధరించి ఇవాన్ ఇలిచ్ ఇంటికి వెళ్ళాడు.

వాకిట్లో రెండు టాక్సీలు, ఒక బండి ఉన్నాయి, కింద హాల్లో శవపేటిక గోడకు ఆనించి ఉన్నది. శవపేటికకు బంగారపురంగుగుడ్డ కప్పారు. మిలామిలా మెరుస్తోంది. నల్లనిదుస్తులు ధరించిన ఇద్దరు స్త్రీలు కనుపించారు. పీటర్ ఇవనొవిచ్ వారిలో ఒకస్త్రీని మాత్రం గుర్తించగలిగాడు. ఆమె ఇవాన్ ఇలిచ్ చెల్లెలు. మరో స్త్రీ అపరిచితురాలు. ష్వార్ట్జ్ అప్పుడే

మెట్లు దిగివస్తూ పీటర్ ఇవనొవిచ్‌ని చూచి ఆగి, 'ఇవాన్ ఇలిచ్ అంతా గందరగోళం చేసి వెళ్ళిపోయాడు. నీలాగా నాలాగా కాదు.' అన్నాడు.

ముందు స్త్రీలు పైకి వెళ్ళిన తరువాత పీటర్ ఇవనొవిచ్ పైకి వెళ్ళాడు. ష్వార్ట్జ్ క్రిందనే ఉన్నాడు. ఆ సాయంత్రం బ్రిడ్జి ఆటకోసం ఏర్పాట్లు చెయ్యడానికి అక్కడున్నాడని పీటర్ గ్రహించాడు. స్త్రీలు పైకి వెళ్ళాక, ష్వార్ట్జ్ గంభీరంగా కనుబొమ్మలు తిప్పి శవం ఉన్న గదిని చూపాడు.

ఇలాంటి సందర్భాలలో సాధారణంగా ఏం చెయ్యాలో ఎవరికీ తెలీదు. పీటర్ ఇవనొవిచ్ కూడా ఇలాంటి అనిశ్చిత భావంతోనే ఆగదిలో అడుగుపెట్టాడు. గదిలో అడుగుపెట్టగానే శిలువగుర్తును అభినయించాడు. ఒక్కమాటు గదినంతా కలయచూచాడు. ఇద్దరు యువకులు - బహుశా ఇవాన్ ఇలిచ్ మేనల్లుళ్ళై ఉంటారు - అప్పుడే గదినుంచి బైటికి వస్తున్నారు. ఒక వృద్ధురాలు నిశ్చలంగా నిల్చుని ఉన్నది. ఒక స్త్రీ మరో స్త్రీ చెవిలో ఏదో రహస్యం చెబుతోంది. ఉత్సాహవంతుడుగా కనుపిస్తున్న ఒక పురోహితుడు పెద్ద గొంతుకతో ఏదో చదువుతున్నాడు. బట్లర్ గెరిసిమ్ నేలమీద ఏదో పరుస్తున్నాడు. ఈ వాతావరణమంతా గమనించేసరికి పీటర్ ఇవనొవిచ్‌కి, ఒక శిథిలదేహం తాలూకు వాసన మెల్లమెల్లగా గుర్తొచ్చింది.

పోయినసారి, ఇవాన్ ఇలిచ్‌ని చూడడానికి వచ్చినప్పుడు గెరిసిమ్ అతని గదిలో ఉన్నాడు. ఇవాన్ ఇలిచ్‌కి అతనంటే ఎంతో ఇష్టం. నర్సులాగా సేవ చేస్తున్నాడు.

పీటర్ ఇవనొవిచ్ శవం వంక చూడడం మొదలెట్టారు.

ఈ మృతజీవి కూడా మృతజీవులందరి లాగానే శవ పేటికలో పడుకుని ఉన్నాడు.

ఇతని శవంకూడా అందరి శవాల్లాగానే ఉంది. శవాలు సాధారణంగా బరువుగా ఉన్నట్టు కనుపిస్తాయి. ఈ శవంకూడా అలాగే ఉంది. పచ్చని నుదురు పైకి పోయినట్టుగా ఉంది. ముక్కు ముందుకువచ్చి పై పెదవిని ఒత్తుతున్నట్టుంది. పీటర్ ఇవనొవిచ్ గతసారి చూచినప్పటికీ, ఇప్పటికీ ఎంతో భేదం కనుపిస్తోంది. మృతుల ముఖాలు బ్రతికి ఉన్నప్పటికంటె అందంగా ఉన్నట్టు కనుపిస్తాయి. ఇతని ముఖంకూడా అతను బ్రతికి ఉన్నప్పటికంటె ఎంతో అందంగా గంభీరంగా కనుపిస్తోంది 'అవసరమైన విషయం అనుకున్నట్టుగా సాధింపబడింది; ఏం జరగాలో అది జరిగింది,' అన్న భావం ఆ మృత వదనంలో ముద్రితమై కనుపిస్తోంది. పైగా బ్రతికి ఉన్న వాళ్ళను హెచ్చరిస్తున్నట్టుకూడా ఉంది. ఈ హెచ్చరిక తనకు సంబంధించింది కాదనుకున్నాడు పీటర్ ఇవానొవిచ్. అతని గదిలో ఊపిరి సలపనట్టయింది. ఇతరులు ఏమనుకుంటారో అనయినా గమనించకుండా బైటికి వెళ్ళాడు.

ష్వార్ట్జ్ ప్రక్కగదిలో అతనికోసం ఎదురుచూస్తూ కూచునిఉన్నాడు. కాళ్ళు జాపుకుని హాట్ చేతులతో ఆడిస్తున్నాడు. హుషారుగా, కులాసాగాఉన్న అతన్ని చూడగానే పీటర్ ఇవనొవిచ్‌కి మళ్ళీ ప్రపంచంలో పడ్డటనిపించింది. అతన్ని ఇలాటి సంఘటనలు కలవరపరచవనీ, అతను నిరాశకు లొంగిపోడనీ అనుకున్నాడు. ఈ దురదృష్ట సంఘటన అతని నిత్య కార్యక్రమానికి అడ్డురాదని అతని చూపునుబట్టే తెలుస్తుంది -

అంత్య అతను కొత్త పేక కలిపి సాయంత్రం కాగానే ఆట వేసుకోడానికి. అసలు, సాయంత్రం కులాసాగా గడపడానికి ఈ సంఘటన అడ్డెందుకు రావాలి? ఈ విషయం పీటర్ ఇవనొవిచ్ చెవిలో చెప్పనుకూడా చెప్పాడు—ఫెడార్ వాసిలివిచ్ యింట్లో ఒక ఆట వేసుకుంటామని. కాని ఆ సాయంత్రంపేకాటకు కూచునేఅదృష్టం పీటర్ ఇవనొవిచ్‌కి పట్టలేదు. తక్షణం అక్కడికి ఒకస్త్రీ వచ్చింది. పొట్టిగా లావుగా ఉంది. ఆ స్త్రీ పేరు ప్రాస్కోవ్యాఫెడరోవ్‌నా. నల్లని దుస్తులు తలకు లేస్ కట్టుకుంది. ఆమె మరికొందరు స్త్రీలతో తన గదిలోనుంచి బైటికివచ్చి వాళ్ళను 'కళేబరంఉన్న గదిలోకి పంపించి, వెంటనే కర్మ ప్రారంభిస్తారు దయచేసి లోపలికి వెళ్ళండి' అన్నది.

ష్వార్ట్‌జ్ వినయపూర్వకంగా ముందుకు వంగాడు. దీనికి అర్థం అతను ఆమె ఆహ్వానం అంగీకరించినట్లో కాదో తెలీలేదు. ప్రాస్కోవ్యాఫెడరోవ్‌నా, పీటర్ ఇవనొవిచ్‌ని చూడగానే గుర్తించి నిశ్వసిస్తూ అతని దగ్గరకువెళ్ళి అతని చెయ్యి తన చేతిలోకి తీసుకుని, 'నీవు ఇవాన్‌ఇలిచ్ ముఖ్య మిత్రుడివని నాకు తెలుసు' అన్నది. తన మాటకు ఎలా ప్రతి చలిస్తాడో అన్నట్టు అతనివంక చూచింది. పీటర్ ఇవనొవిచ్‌కి ఆమె ఉద్దేశం తెలుసు. ఆమె చెయ్యి నొక్కి, నిశ్వసించి, 'నన్ను నమ్మ...' అని ఏవేవో ఓదార్పు పలుకులు పలకాలని తెలుసు. అతను వెంటనే ఈ పనులన్నీ చేశాడు. తను ఊహించిన ఫలితంకూడా వచ్చింది. ఆమె, అతనూ – ఇద్దరూ స్పందించారు.

'నాతోరా. కర్మ ప్రారంభించకముందు నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి,' అన్నది ఆ విధవరాలు.

పీటర్ ఇవనొవిచ్ చెయ్యి పట్టుకుని ఆమె లోనికి తీసుకుని వెళ్ళింది.

ఆమె ఇలా లోనికి తీసుకుని వెడుతూఉంటే పీటర్ ఇవనొవిచ్ మరింత గాఢంగా నిశ్వసించడం మొదలెట్టాడు. ఆమె కృతజ్ఞతతో అతని చెయ్యి మరింత గాఢంగా ఒత్తింది. ఇద్దరూ డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళారు. ఆమె ఒక సోఫాలో కూచుంది, పీటర్ ఇవనొవిచ్ మరో చిన్న సోఫాలో కూచున్నాడు. అతని బరువుకు స్ప్రింగులు అడుగుకు అణిగిపోయాయి. అతన్ని మరో సోఫాలో కూచోమని అడుగుదామనుకుంది ప్రాస్కోవ్యా ఫెడరొవ్‌నా. కాని, తన ప్రస్తుత పరిస్థితిలో అలా అడగడం బాగుండదని ఊరుకుంది. గదిలో కూచోగానే, ఇవాన్‌ఇలిచ్ ఈ గదిని అలంకరించడం విషయంలో తనను సలహా అడగడం జ్ఞాపకం వచ్చింది. తన సలహాప్రకారమే గోడలకు పింక్ రంగు వేయించాడు. ఆకుపచ్చని ఆకులు గీయించాడు. గదినిండా ఫర్నిచర్ ఉంది—కావలసినన్ని సోఫాలు, టేబిళ్ళు, కుర్చీలు. సోఫా దగ్గరకు వెడుతూఉండగా ప్రాస్కోవ్యా ఫెడొరొవ్‌నా శాలువా టేబిల్ అంచుకు చిక్కుకుంది. పీటర్ ఇవనొవిచ్ శాలువా చిక్కు తీద్దామని లేచాడు. తన సోఫా స్ప్రింగులు తనతోపాటు లేచాయి. విధవరాలు తనంతట తానే శాలువా తీసుకుంటున్నది. పీటర్ ఇవనొవిచ్ మళ్ళీ కూచున్నాడు. స్ప్రింగులు అణిగిపోయాయి. ఇంకా ఆమె చిక్కుకున్న శాలువా పూర్తిగా తీసుకోలేదు. పీటర్ ఇవనొవిచ్

మళ్ళీ లేచాడు. సోఫా క్రిరు క్రిరు మన్నది. ఈ గొడవంతా కాగానే, ఆమె ఒక సిల్కు చేతిరుమాలు తీసుకుని ఏడవడం ప్రారంభించింది. శాలువా గొడవ; సోఫా గొడవ, పీటర్ ఇవనొవిచ్‌ని కొంచెం చల్లబరిచాయి. అతను స్తబ్ధంగాచూస్తూ కూచున్నాడు. ఇది ఇలాఉండగా ఇవాన్ఇలిచ్ బట్లరు సోకొలోవ్ లోపలికివచ్చి, ప్రాస్కోవ్యా ఫెడరొవ్నా గోరీలదొడ్లో కోరిన ప్రదేశం రెండువందల రూబుళ్ళవుతుందని చెప్పాడు. ఆమె ఏడుపు మానివేశి పీటరు ఇవనొవిచ్ వంకచూచి అంత ఖరీదుగలస్థలం కొనడం తనకెంతో కష్టమన్నది పీటర్ ఇవనొవిచ్ అవునన్నట్టు తల ఊపాడు.

'మీరు సిగరెట్ కాలుస్తూ ఉండండి' అని సోకొలోవ్‌తో స్థలం బేరం మాట్లాడడం మొదలెట్టింది.

పీటర్ ఇవనొవిచ్ సిగరెట్ కాలుస్తూ ఆమె బేరం వింటూ కూచున్నాడు. గోరీలదొడ్డిలో వివిధస్థలాలు కూరల బేరంలా అడిగింది. చివరకు ఎలాగైతేనేం ఒక స్థలం నిర్ణయించింది. సోకొలొవ్ తరువాత బైటికి వెళ్ళాడు.

'అన్ని విషయాలు నేనే చూచుకోవాలి,' అన్నది. టేబిల్ మీద ఆల్బం తిరగేస్తూ. వెంటనే, టేబిల్‌మీద అతని సిగరెట్ పొడి రాలి ఉండడం గమనించి అతని దగ్గరగా ఒక యాష్‌ట్రే పెట్టింది. 'ఈ దుఃఖంలోనే ఇలాటి విషయాలెన్నో చూచుకోవాలి. ఈ విషయాలన్నీ చూచుకోడానికి నా దుఃఖం అడ్డువస్తోందని చెప్పడానికి నేనెంతో సిగ్గుపడతాను. పైగా నేనీ సమయంలో ఎవరినైనా కోరే సహాయం ఒకటే, నన్ను ఓదార్చమని అడగను. నా దుఃఖాన్ని విస్మరింపచేసే విష

 యాలు చెప్పమంటాను?' అన్నది. మళ్ళీ ఏడవడానికి ప్రారంభించబోతున్నట్లుగా తన సిల్కు రుమాలు బైటికి తీసింది. కాని వెంటనే నిగ్రహించుకుని, 'నీతో ఒక విషయం మాట్లాడాలి' అన్నది. పీటర్ ఇవనొవిచ్ ఆమె చెప్పేదంతా వినడానికి సిద్ధపడ్డాడు.

'చివరరోజుల్లో భయంకరంగా బాధపడ్డాడు'

'నిజంగా?' అన్నాడు పీటర్ ఇవనివిచ్.

'అబ్బ! ఆ బాధ చెప్పడానికి వీల్లేదు. ఒక్క క్షణం కూడా విశ్రాంతి ఉండేదికాదు. గంటల కొద్ది విపరీతంగా మూలిగేవాడు. చివరి మూడు రోజులవుతే ఇహ – అంతూ పొంతూలేదు. భరించలేకపోయాను. ఇంట్లో ఏ గదిలో కూచున్నా ఆ మూలుగులు వినిపించేవి. నా బాధ నాకు తప్ప మరెవరికి తెలుస్తుంది!'

'చివరివరకూ అతను స్మారకంలో ఉన్నాడా?'

'చిట్టచివరి క్షణంవరకూ స్మారకంలోనేఉన్నాడు. చనిపోవడానికి ఒక పావుగంట ముందు మా అందరిదగ్గరా సెలవుతీసుకున్నాడు. వొలోడ్యాను బైటికి తీసుకుని వెళ్ళమన్నాడు.'

తనమిత్రుడు కడపటిక్షణాలలో ఇలా బాధపడ్డాడని విని పీటర్ ఇవనొవిచ్ భయచలితుడైపోయాడు. ఇద్దరూ చిన్ననాటినుంచీ మిత్రులు. బాల్యంలో కులాసాగా ఆడుకునే కుర్రాడిగా, స్కూల్లో తోటివిద్యార్థిగా, తరువాత కాలేజీలో క్లాస్ మేట్ గా – అన్నివిధాలా ఇవాన్ ఇలిచ్ ని తెలుసు పీటర్ ఇవనొవిచ్ కి. అతని స్మృతిపథంలో జ్ఞాపకాలన్నీ ఒక్కసారి తళుక్కుమని మెరిశాయి. మళ్ళీ అతని మృతకళేబరం జ్ఞాపకం

వచ్చింది - ఆ నుదురూ, ఆ ముక్కూ పీటర్ ఇవనొవిచ్ తనలోతాను భయపడ్డాడు.

'మూడురోజులు భీకరమైన బాధ! తరువాత మృత్యువు! ఒకనాటికి నాకూ ఇలాగే జరగొచ్చు' - ఒక క్షణంపాటు ఈ భావం అతని మనస్సులో మెరిసి అతన్ని భయభ్రాంతుణ్ణి చేసింది. కాని, తన భయాన్ని తానే నమ్మలేకపోయాడు. మానవు లందరికీ సాధారణంగా కలిగేభావం వెంటనే అతని మనస్సులో కలిగింది. చనిపోయింది ఇవాన్ఇలీచ్ కాని, తను కాదనీ; అలాంటి సంఘటన తనకెప్పుడూ ప్రాప్తించకూడదనీ, ప్రాప్తించదనీ, అలాటి సంఘటన సంభవిస్తుందనుకుంటే తను పూర్తిగా నిరాశలో మునిగిపోవలసి ఉంటుంది కాబట్టి అలా భావించకూడదనీ - అనుకున్నాడు.

పీటర్ ఇవనొవిచ్ కి ఈ ఆలోచనలు రాగానే మళ్లీ జీవితంలో విశ్వాసం కుదురుకుంది. మృత్యువనే సంఘటన ఒక్క ఇవాన్ ఇలీచ్ కే కాని, తనకు సంబంధించింది కానట్టుగా, అతని మరణాన్ని గూర్చి వివరాలు అడగడం మొదలెట్టాడు.

ఇవాన్ ఇలీచ్ కడపటి క్షణాలలో భరించిన శరీర బాధను గురించి ఎన్నో భీకరమైన వివరాలు చెప్పింది. ప్రాస్కొ వ్యా ఫెడొరొవ్ నా.

'ఎంత ఘోరం! ఎంత ఘోరం! అబ్బ! ఎంత ఘోరం!' అంటూ ఏడవడం మొదలెట్టింది.

పీటర్ ఇవనొవిచ్ ఒక్కమాటు బరువుగా నిశ్వసించి ఆమె ఏడుపు మానెయ్యడంకోసం కాచుకుని కూచున్నాడు. ఆమె ఏడుపుమాని, ముక్కుతుడుచుకుని, అతనితో ముఖ్యంగా

తనకు అవసరం ఉన్న విషయం మాట్లాడడం మొదలెట్టింది. అది తన భర్త మరణించిన సందర్భంలో ప్రభుత్వం వద్దనుంచి డబ్బు గ్రాంటు పొందడం ఎలాగా అని. ఆమె పెన్షన్ విషయాన్ని గురించి సలహా అడుగుతున్నదనుకున్నాడు పీటర్ ఇవనోవిచ్. కాని ఆవిషయం తనకంటె ఎక్కువగా ఆమెకే తెలిసినట్టు గ్రహించాడు. తనభర్త మరణించడంవల్ల ప్రభుత్వం దగ్గర నుంచి ఎంత డబ్బు వస్తుందో ఆమెకు బాగా తెలుసు. ఆమె బాధల్లా ఒకటే—అంతకంటే అదనంగా రాబట్టడానికి వీలుండదా అని పీటర్ ఇవనోవిచ్ కాసేపు ఆలోచించి, ప్రభుత్వం నీచమైనదని తిట్టి, అంతకంటె ఎక్కువ రాబట్టడానికి వీల్లేదని చెప్పాడు. ఈ మాటవిన్న తరువాత అతనితో అవసరం తీరి పోయినట్టు—అతను ఎప్పుడు వదిలి పోతాడా అని ఎదురు చూచింది. పీటర్ ఇవనోవిచ్ ఇది గమనించి సిగరెట్ ఆర్పేసి బైటికివెళ్ళాడు.

పీటర్ ఇవనోవిచ్ భోజనాల గదిలోకి వెళ్ళాడు. అక్కడొక పెద్దగోడగడియారం ఉంది. ఒక పాత షాపులో ఇవాన్ ఇలిచ్ ఆ గడియారంకొనడం పీటర్ ఇవనోవిచ్‌కి తెలుసు. ఆ గడియారమంటే ఇవాన్ ఇలిచ్‌కి ఎంతో ఇష్టంకూడా. పీటర్ ఇవనోవిచ్ హాల్లోకి వెళ్ళగానే పురోహితుడూ, మరికొందరు పరిచితులూ కనుపించారు. ఇవాన్ ఇలిచ్ కూతురుకూడా అక్కడే ఉంది. ఆమె చాలా అందెగత్తె. యౌవనవతి. నల్లని దుస్తుల్లో అందంగా సన్నని తీగలా కనుపిస్తోంది. ఆమెముఖం ఎంచేతనో గంభీరంగా కోపంవచ్చినవారి ముఖంలా ఉంది. ఆమె వెనకాలగా ఒకయువకుడు నిల్చునిఉన్నాడు. అతను మాస్ట్రీటు.

బాగా ఉన్నవాడు. పీటర్ ఇవనివిచ్ కూడా పరిచితుడే. అతను ఆమె ప్రియుడని విన్నికిడి. పీటర్ ఇవనొవిచ్ వీరందరికీ నమస్కరించి కళేబరం ఉన్న గదిలోకి వెళ్ళబోతూ ఉండగా మెట్లకింద ఇవాన్ఇలిచ్ చిన్నికొడుకు నిల్చుని ఉండడం చూచాడు. కుర్రాడు అచ్చంతండ్రిలాగానేఉన్నాడు. తను ఇవాన్ఇలిచ్‌తో కలిసి లా చదివేరోజుల్లో ఇవాన్ ఇలిచ్ సరిగ్గా ఇలాగేఉండేవాడు. ఆకుర్రాడి కళ్ళు అశ్రుపూరితాలై ఉన్నాయి. స్వచ్ఛ మనస్కులు కాని, పదమూడు పద్నాలుగేళ్ళ కుర్రాళ్ళకళ్ళలో కనుపించే ఒకభావం ఆ కుర్రాడికళ్ళలో కనుపిస్తోంది, పీటర్ ఇవానొవిచ్ అతని వంకచూచి తలఊసి మృత్యుమందిరంలోకి ప్రవేశించాడు. కర్మప్రారంభించబడింది. కొవ్వొత్తులు, మూలుగులు, సాంబ్రాణిపొగ, కన్నీళ్ళు, నిశ్వాసలు, ఏడ్పులు, ఇదీ కర్మ.

పీటర్ ఇవనొవిచ్ తన కాళ్ళవంక చూచుకుంటూ నిలుచున్నాడు. ఒక్కమారైనా శవంవంక చూడలా. అలా చూస్తే నిరాశ తన్ను కప్పేస్తుందేమోనని భయపడ్డాడు. అందరికంటె ముందుగా గదిలోనుంచి బయటపడ్డాడు. పక్క గదిలో ఎవరూలేరు. ఈ లోగా గెరసిమ్ వచ్చాడు. 'చాలా విచారకరమైన విషయం' అన్నాడు పీటర్ ఇవనొవిచ్. 'అంతా ఈశ్వరేచ్ఛ ఎవరికి మాత్రం తప్పుతుందా?' అన్నాడు గెరసిమ్. వెంటనే తలుపు తెరిచి గుర్రపు బగ్గీపిలిచి పీటర్ ఇవనొవిచ్‌ని ఎక్కించి తను వెనకాల నిల్చున్నాడు.

చల్లనిగాలి విసిరింది. పీటర్ ఇవనొవిచ్‌కి కొంచెం ఊపిరి సలిపింది.'

'ఎక్కడికయ్యా?' గుర్రపు బగ్గీవా డడిగాడు.

'ఫెడార్ వాసిలివిచ్ ఇంటికి'

గుర్రపుబగ్గీ బయలు దేరింది! అక్కడికి చేరేసరికి వాళ్ళింకా పేకాటలోనే ఉన్నారు.

## 2

ఇవాన్ ఇలిచ్ జీవితం చాలా సామాన్యమైనది. అంచాతనే చాలా భయంకరమైనది.

అతను కోర్టుఆఫ్ జస్టిస్ మెంబర్‌గా ఉండి తన నలభై అయిదవ సంవత్సరంలో చనిపోయాడు. అతని తండ్రి పెద్ద ఆఫీసర్‌గా ఉండేవాడు. పీటర్స్ బర్గ్‌లో ఎన్నో ప్రభుత్వ శాఖల్లోనూ వివిధ మంత్రివర్గ కార్యాలయాల్లోనూ పనిచేశాడు. క్రమ క్రమంగా ఉన్నత స్థానాలు సంపాదించాడు. చాలా కాలంగా పనిచేస్తూ ఉండబట్టి, బాధ్యతగల పదవులకు అనర్హులైనప్పటికీ వారిని తొలిగించరు. పైగా వారికోసం ప్రత్యేకపదవులు సృష్టిస్తారుకూడా. ఆ పదవులు వట్టి బూటకప్పదవులైనా పదివేలరూబుళ్ళ జీతాలుమాత్రం బూటకంకాదు. నెల కాగానే కచ్చితంగా రాలాల్సిందే.

ప్రీవీ కౌన్సిలర్ పదవి ఇలాంటిది. ఇలాంటిసంస్థల్లో ఇంకా ఎన్నింటిలోనో అతను సభ్యుడు.

అతనికి ముగ్గురు కొడుకులు. ఇవాన్ఇలిచ్ రెండోవాడు. పెద్దవాడు ఒక ప్రభుత్వ శాఖలో పనిచేస్తున్నాడు. తండ్రి అడుగుజాడలు అనుచరిస్తున్నాడు. పెద్ద పదవికివచ్చే సూచనలు కూడా ఉన్నాయి. మూడోవాడు ఎందుకూ పనికిరాకుండా

పోయాడు. ఎన్నో ఉద్యోగాలు చేశాడు. కాని ఒక్కదాని లోనూ పైకి రాలేకపోయాడు. ఇప్పుడు రైల్వేశాఖలో పని చేస్తున్నాడు. అతనంటే తండ్రికికాని అన్నలకుకాని ఎవరికీ ఇష్టంలేదు. తల్లికీ, వదినలకూ కూడా అంతే.

వాడొకడు ఇంట్లో ఉన్నట్టుగాకూడా అనుకోరు. పెద్ద అవసరండుంటే తప్ప వాడిని పిలిచి మాట్లాడరు. వాడికో చెల్లెలుంది. ఆ అమ్మాయిని బారన్‌గ్రెఫ్ అనే ఒక పీటర్స్బర్గు ఉద్యోగస్థునికిచ్చి పెండ్లి చేశారు. అతనూ తన మామగారి లాంటివాడే. ఇవాన్ ఇలిచ్ సంసారపక్షం మనిషి. అన్నలాగా బిగుసుకుని ఉండేవాడూకాదు—తమ్ముడిలా గడుగ్గాయీకాదు, రెండు స్వభావాలూ అతనిలో సామరస్యంపొందాయి. తెలివిగా నాజూగ్గా, కులాసాగా, అందరితో కలేగలుపుగా ఉండేవాడు. చిన్నవాడితో కలిసి లా స్కూలులో చదువుకున్నాడు. చిన్న వాడుమాత్రం చదువు ముగించలేదు, అయిదో తరగతిలో ఉండగానే అతన్ని స్కూలునుంచి బహిష్కరించారు. ఇవాన్ ఇలిచ్ మాత్రం చదువు పూర్తిచేశాడు. లా చదువుతున్నప్పుడు కూడా, అతను తన తరువాత జీవితంలో ఎలాఉన్నాడో అలాగే ఉండేవాడు. శక్తి, ఉత్సాహం, సాధుస్వభావం అతనిలో కనిపిస్తూఉండేవి. ప్రతిమనిషితో స్నేహంగా ఉండేవాడు. కాని, తన బాధ్యతమాత్రం మరిచిపోయేవాడుకాదు. అధికారంలో ఉన్నవాళ్ళు ఫలానిది బాధ్యతఅంటే తనూ అదే బాధ్యతను కునేవాడు. ఎప్పుడూ శ్రమపడి పనిచేసేవాడు.

చిన్నతనంనుంచీ అతనంటే అందరికీ ఇష్టంగా ఉండేది. పెద్దపదవుల్లో ఉండేవాళ్ళు సహజంగా అతన్ని ఆకర్షించేవారు.

వారి పద్ధతులనూ, అలవాట్లనూ, జీవితంపట్ల వారి ఉద్దేశాలనూ తనూ అనుసరించేవాడు. వారితో స్నేహసంబంధాలు ఏర్పరుచుకునేవాడు. చిన్నతనపు ఉత్సాహాలన్నీ అతనిపై పెద్ద ముద్రవెయ్యకుండానే గతించిపోయాయి. శరీరవాంఛలకూ, దర్పానికి లొంగిపోయాడు. తరువాత పై వర్గాల స్వేచ్ఛాతత్వం కూడా అతనికి అలవడింది. కాని, ఎన్నడూ హద్దులు దాట లేదు. తన హృదయం ఎలాచెబితే అలా నడుచుకున్నాడు.

అతను బళ్ళో చదువుకునే రోజుల్లో చేసిన కొన్ని పనులు పూర్వం అతనికే అసహ్యంగా కనుపించేవి. అలాంటి పనులు తను ఎందుకుచేశానా అనిపించేది. కాని, తరువాత పెద్ద పెద్ద పదవుల్లో ఉండేవారుకూడా అలాంటివనులే చెయ్యడం చూచాడు. వాళ్ళు ఆ పనులు తప్పుగా ఎంచుకోడంలేదు. ఈ వైరుధ్యం అతనికి కొంత ఆందోళన కలిగించింది. కాని అతను వాటినిగురించి అట్టే ఆలోచించకుండా పూర్తిగా మరిచిపోవ డానికి ప్రయత్నించాడు.

లాస్కూల్‌లో గ్రాడ్యుయేట్ డిగ్రీ పుచ్చుకుని, సివిల్ సర్వీసులో పదో తరగతికి అర్హత సంపాదించినతరువాత, తను స్థిరపడడానికని తండ్రిదగ్గర కొంతడబ్బు పుచ్చుకుని,ఇవాన్ఇలిచ్ ఒక మంచి టయిలర్ దగ్గరికి వెళ్ళి బట్టలు కుట్టమని ఆర్డరి చ్చాడు. కొత్త రిస్టువాచీ కొనుక్కున్నాడు. కాలేజీ ప్రిన్సి పాల్ దగ్గరా, కాలేజీ రాజపోషకుని దగ్గరా సెలవు పుచ్చు కున్నాడు. తన తోటి విద్యార్థులతో కలిసి ఒక పెద్ద హోటల్లో విందారగించాడు. తరువాత, తన కొత్తబట్టలూ, టాయిలెట్ సామానూ చక్కగా పెట్టెలో సర్దుకుని ఉద్యోగంలో ప్రవేశించ

డానికి ప్రయాణమై వెళ్ళాడు. తన తండ్రి సిఫార్సులద్వారా గవర్నర్‌కు సంబంధించిన ఒక ఆఫీసర్ పదవి దొరికింది అతనికి.

జిల్లాకు వెళ్ళి, ఉద్యోగంలో ప్రవేశించగానే ఇవాన్ ఇలిచ్, లా స్కూల్లో తన స్థితిని ఎలా సుస్థిరం చేసుకున్నాడో అలాగే తన పదవిని సుస్థిరం చేసుకున్నాడు. తన ఉద్యోగ ధర్మాలను చక్కగా నిర్వహించాడు. ఉద్యోగస్థుడుగా పేరు ప్రతిష్టలు సంపాదించుకున్నాడు. పైకి వెళ్ళడానికి మెట్లన్నీ ఏర్పరచుకున్నాడు. ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తూనే హాయైన ఆనందమయమైన జీవితం గడిపాడు. ఎప్పుడో కాని గ్రామాల్లోకి వెళ్ళేవాడు కాదు. తనపైన అధికారులతోనూ, క్రింది అధికారులతోనూ తన పరువుకు ఎలాటి భంగమూ రాకుండా జాగ్రత్తగా ప్రవర్తించేవాడు. తన ఉద్యోగధర్మాన్ని తు. చ. తప్పకుండా ఎంతో నిజాయితీతో నిర్వహించేవాడు. తన నిజాయితీకి నిజంగా తను గర్వించే వాడుకూడా.

తను యువకుడు. అందులోనూ, చాలా కులాసా మనిషి. అయినా ఉద్యోగ వ్యవహారాలలో కచ్చితంగా; గంభీరంగా ఉండేవాడు. ఎవరికీ చనువిచ్చేవాడుకాదు. ఒక్కోసారి అవసరమవుతే తీవ్రంగాకూడా ప్రవర్తించేవాడు. ఆఫీసు వ్యవహారాల తరువాత, సంఘంలో ఉన్నప్పుడు మాత్రం కులాసాగా ఉండేవాడు. అందరితో చమత్కారంగా మాట్లాడేవాడు. సహజంగా అతనిది సాధుస్వభావం. గవర్నర్, గవర్నర్ భార్య, ఇవాన్ ఇలిచ్‌కూడా మాకుటుంబంలో ఒక డంటూ అతన్ని ప్రశంసించేవారు. అతని ప్రవర్తన ఎంతో చక్కనిదని మెచ్చుకునేవారు.

అప్పుడు అక్కడ ఒక స్త్రీతో ఒక ప్రేమకలాపంకూడా ఏర్పడింది. అప్పుడప్పుడూ అనుమానాస్పదమైన సందుల్లో కూడా సంచరించేవాడు కాని ఇవన్నీ ఎంతో నాజూగ్గా అందంగా చక్కటి పేర్లతో సాగిపోయేవి పెద్ద మనుషులుకూడా అంగీకరించేవారు.

ఇలా ఇవాన్ ఇలిచ్ అయిదు సంవత్సరాలు ఉద్యోగం చేశాడు. తరువాత అతని ఉద్యోగ జీవితంలో ఒక మార్పు వచ్చింది. కొత్తగా సంస్కరింపబడిన న్యాయసంస్థలను దేశంలో ప్రవేశపెట్టారు ఈ సంస్థలలో పదవులకు కొత్త మనుష్యులు అవసరమైనారు. ఇవాన్ ఇలిచ్ కూడా వీరిలో ఒకడు. అతనికి ఎగ్జామినింగ్ మాజిస్ట్రేటుపదవి నిచ్చారు. ఈ పదవికోసం మరో రాష్ట్రానికి వెళ్ళవలసి వచ్చినప్పటికీ అతను అంగీకరించాడు. స్నేహితులందరూ సమావేశమై అతనికి వీడ్కోలు నిచ్చారు, గ్రూప్ ఫోటోకూడా ఏర్పాటు చేశారు ఒక వెండి సిగరెట్ కేస్ కూడా బహూకరించారు. ఇలా అందర్ని మన్ననా పొంది. అతను కొత్త ఉద్యోగానికి ప్రయాణమై వెళ్ళాడు. కొత్తపదవిలో ప్రవేశించినతరువాతకూడా ఇవాన్ ఇలిచ్ వ్యక్తిత్వం పూర్వంలాగానే ఉంది. అందరి గౌరవమన్ననలూ పొందాడు. పూర్వపు ఉద్యోగంచేసేరోజుల్లో తన వ్యక్తిగతజీవితాన్నీ, ఉద్యోగధర్మాన్నీ వేరువేరుగా ఉంచగలిగేవాడో అలాగే ఉంచాడు, ఈ కొత్తపదవి స్వీకరించిన తరువాత, అతని ఉద్యోగధర్మాలు పూర్వంకంటెకూడా మరెంత ఆకర్షణీయంగా ఉన్నాయి. పూర్వపుపదవిలో ఉండగా చిత్రంగా ఉండేది. గవర్నర్ కోసం ఎందరో ఆఫీసర్లు, ఇతరులూ పిటీషన్లు పట్టుకుని

కాచుకుని ఉండేవారు. ఇవాన్ ఇలిచ్, తను నగరంలో కుట్టించు కున్న కొత్త దుస్తులు ధరించి వారందరూ చూస్తూండగా సరా సరి గవర్నర్ ప్రైవేట్ రూమ్‌లోకి వెళ్ళిపోయేవాడు. గవర్నరుతో కలిసి టీ సేవించి సిగరెట్ కాలుస్తూ కూచునేవాడు. ఇలా అతను వెడుతూంటే చూచి తోటిఆఫీసర్లందరూ అసూయపడే వారు. ఆరోజుల్లో అతనిమీద ముఖ్యంగా పోలీస్ ఉద్యోగస్తులు ఆధారపడి ఉండేవారు. తను టూర్ కు వెళ్ళినప్పుడు తనతో కలిసి వచ్చేవారు. తను పైఅధికారి అయినప్పటికీ, వాళ్ళను మర్యా దగా స్నేహభావంతో చూచేవాడు. వాళ్ళను అణిచెయ్య డానికి తగినంతశక్తి, అధికారం తనకున్నప్పటికీ, ఇలా స్నేహ భావంతో చూస్తున్నాడని వాళ్ళు అనుకునేట్టు ప్రవర్తించే వాడు. ఇప్పుడు అతని పదవి మారింది. పెద్దపదవికి వచ్చాడు. ఎగ్జామినింగ్ మాజిస్ట్రేటయ్యాడు. ఇప్పుడు ఎంతో పెద్దపెద్దవారు ప్రధానోద్యోగులుకూడా అతని అధీనంలో ఉంటున్నారు. కాగితంమీద అతను రెండుముక్కలు రాశాడంటే చాలు — ఎంతప్రధానమైన వ్యక్తిఅయినా నేరస్థుడుగానో లేక సాక్షి గానో తనముందుకు వచ్చి నిల్చోవాల్సిందే. తను మర్యాదగా కూచోమంటే సరేసరి. లేకపోతే తనముందు ఎంతసేపైనా నిల్చుని తను అడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానం చెప్పా ల్సిందే. ఇవాన్ఇలిచ్ ఎన్నడూ తన అధికారాన్ని దుర్విని యోగం చెయ్యలేదు. పైగా మృదువుగా కనుపింపచెయ్య డానికి యత్నించాడు. తన పదవిలో అతన్ని ముఖ్యంగా ఆకర్షించిన విషయంకూడా ఇదే. తన పదవీ, తన అధికారం గొప్పదని తనకు తెలుసు. దాన్ని పైకి కనబరచకుండా మృదు

వుగా కనుపించేటట్టు చెయ్యవచ్చుననికూడా తనకు తెలుసు. అతను సాక్షులనూ, నేరస్థులనూ, ముద్దాయిలనూ పరీక్షించే విధానం కొత్తగాఉండేది. ఎంత క్లిష్టమయిన కేసయినా ఎంతో సులభంగా విచారణ సలిపేవాడు. కేసు స్వరూపాన్ని యథా తథంగా రికార్డ్ చేశేవాడు తన వ్యక్తిగత అభిప్రాయాలను అందులో కలిపేవాడుకాదు. 1864 కొత్తచట్టాన్ని అనువర్తించిన మొట్టమొదటివారిలో ఇవాన్ఇలిచ్ ఒకడు.

కొత్తఊళ్ళో, కొత్తపదవిలోకి వచ్చిన తరువాత ఇవాన్ ఇలిచ్ దృక్పథంలో కొన్ని మార్పులు ఏర్పడ్డాయి. కొత్త పరిచయాలు, సంబంధ బాంధవ్యాలు ఏర్పడ్డాయి. తన క్రింది అధికారులకు దూరంగా ఉండేవాడు, వారితో అంత కలిసి మెలిసి ఉండేవాడు కాదు. ఊళ్ళోఉన్న పెద్ద పెద్ద న్యాయ వాదులతోనూ, శ్రీమంతులైన పెద్దమనుషులతోనూ స్నేహం చేశాడు. ఆ వర్గంలోనే సంచరించేవాడు. అప్పు డప్పుడు ప్రభుత్వంపట్ల కొద్దిగా అసంతృప్తి వెల్లడించేవాడు. లిబరల్ దృష్టి కొద్దిగా అలవరచుకున్నాడు. పూర్వం లా చక్కగా టాయిలెట్ కావడం మానలేదుకాని, గడ్డంమాత్రం పెంచడం మొదలెట్టాడు.

ఈ కొత్తఊళ్ళో ఇవాన్ఇలిచ్ హాయిగా స్థిరపడి పోయాడు. సంఘంలో పెద్దలందరూ అతనికి స్నేహితులయ్యారు. జీతంకూడా పెద్దది. రోజూ క్లబ్బులో బ్రిడ్జి ఆటకు వెళ్ళేవాడు. ఆటలో గొప్ప తెలివితేటలు చూపేవాడు. ఎప్పుడూ అతనిదే గెలుపు.

ఇలా రెండు సంవత్సరాలు గడిచిన తరువాత అతనికీ అతని కాబోయే భార్య ప్రాస్కోవ్యాకు పరిచయం కలిగింది. తను తిరిగే సంఘంలో కల్లా, అంత అందమైన అంత తెలివి తేటలు గల పిల్ల లేదు. ఇవాన్ ఇలిచ్ ఆ అమ్మాయితో కులాసాగా ఉంటుండేవాడు.

పూర్వం తను స్పెషల్ సర్వీస్ శాఖలో ఉద్యోగస్థుడుగా ఉన్నప్పుడు, ఇవాన్ ఇలిచ్‌కి డాన్సుకు వెళ్ళడం అలవాటుండేది. కాని, ఇప్పుడు మాజిస్ట్రేటు పదవికి వచ్చిన తరువాత ఎప్పుడో కాని డాన్సుకు వెళ్ళడంలేదు. ఇప్పుడు ఎప్పుడైనా డాన్సుకు వెళుతున్నాడంటే దానికి కారణం— తను పెద్ద పదవిలో ఉండికూడా, అవసరమవుతే ఇతరులకంటె కూడా బాగా డాన్సు చెయ్యగలనని చూపడానికి మాత్రమే. అప్పుడప్పుడూ, సాయంసమయాల్లో ప్రాస్కోవ్యా ఫెడొరొవ్‌నా తో కలిసి డాన్సు చేసేవాడు. ఈ డాన్సులద్వారానే ఆమెను ఆకర్షించి ముగ్ధురాలిని చెయ్యగలిగాడు. తనూ, ఆమె పరస్పరం ప్రేమించుకున్నారు. మొదట్లో ఆమెను పెండ్లాడదామనే ఉద్దేశం లేదు ఇవాన్ ఇలిచ్‌కి. ఆమె ప్రేమించిందని తెలుసుకున్న తరువాత 'పెండ్లాడితే తప్పేముంది?' అనుకున్నాడు.

ప్రాస్కోవ్యా ఫెడరొవ్‌నా గొప్ప కుటుంబంలో పుట్టింది. అందంగా ఆకర్షణీయంగా ఉంటుంది. ఆస్తి కొద్దిగా ఉంది.

ఇవాన్ ఇలిచ్‌కి ఇంతకంటె పెద్ద సంబంధం వచ్చేదే కాని ఇదికూడా అతనికి తగిన సంబంధమే అనుకున్నాడు. తన జీతం తనకు వస్తుంది.

ఆమె ఆ స్త్రీమీద ఆమెకు కావలసినంత డబ్బు వస్తుం దనుకున్నాడు. పైగా ఆమెకు ఎన్నో గొప్ప కుటుంబాలతో సంబంధ బాంధవ్యాలున్నాయి. కులం, గుణం, రూపం అన్నీ ఉన్నాయి. ప్రాస్కోవ్యా ఫెడలుల్‌నాను ప్రేమించడంవల్ల, తన అభిప్రాయాలపట్ల ఆమె సానుభూతి చూపడంవల్ల, తను వివాహం చేసుకోడానికి నిశ్చయించుకున్నాడనడం సమంజసం కాదు. అతను సాధారణంగా కలిసి తిరిగే సంఘం ఒప్పుకోడం వల్లనూ కాదు. అతను అన్నివిధాలా ఆలోచించి చూచాడు. వివాహం అతనికి వ్యక్తిగతంగా పూర్తిసంతృప్తినిచ్చింది. అంతే కాక, గొప్పపదవుల్లో ఉన్న తన సహచరులందరూ అంగీక రించారు. ఇవాన్‌ఇలిచ్‌కి, ప్రాస్కోవ్యా ఫెడరోవ్‌నాకు వివాహం జరిగింది. ముందు వివాహ యత్నాలు, తరువాత దాంపత్య జీవితపు తొలిరోజులు. పరస్పరం చెప్పుకున్న ప్రణయ రహ స్యాలు, వినోదాలు, కొత్తబట్టలు, ఫర్నిచర్, అందచందాలు, అలంకారాలు – ఇవన్నీ ఇవాన్ ఇవిచ్‌కి ఎంతో ఆనందాన్ని చ్చాయి. దంపతులు ఆనందంలో మునిగితేలారు. ఈలోగా ఇవాన్ ఇలిచ్ భార్య గర్భవతి అయింది. అతని భార్య గర్భవతి అయిన కొద్దిరోజులనుంచి పూర్వపు ఆనందం మాసిపోయి నట్టుగా కనుపించసాగింది. వివాహమైన తొలిదినాల్లో బాగానే తన జీవితం పూలపాన్పులాగా గడుస్తుందనుకున్నాడు. కాని అలా జరగలేదు. తనకు ఇంతవరకూ అనుభవంలోకి రాని ఒక కొత్తమార్పు అతని జీవితంలో ప్రవేశించినట్టు తోచింది. ఒక విధమైన దిగులూ, నిరుత్సాహం, అశక్తి ఆవరించాయి.

కారణం లేకుండానే తన భార్య వారిజీవితంలో అనవసర మైన ఆందోళన తెచ్చిపెట్టసాగింది. ఎంచాత అలాచేస్తుందో తను ఊహించలేకపోయాడు. అకారణంగా అసూయచూపేది. అతనెప్పుడూ తనను కాచుకుని ఉండాలనేది. శ్రద్ధగా తనపట్ల మాత్రమే చూపాలనేది. ప్రతిపనిలో ఏదో ఒకతప్పు పట్టుకునేది. ఆమె ప్రవర్తన అనవసరమైన పోట్లాటలకు, కొట్లాటలకు దారి తీసేది.

మొట్టమొదట్లో ఈ దుర్భర పరిస్థితులనుంచి తప్పుకుందామని ప్రయత్నించాడు ఇవాన్ఇలిచ్. ఇంతకాలం తను జీవితం ఎలా కులాసాగా ఆనందంగా గడిపాడో అలాగే గడిపి ఈ గొడవలన్నీ విస్మరిద్దామనుకున్నాడు. తన భార్య కోపతాపాలు పట్టించుకోకుండా ఉండడానికి ప్రయత్నించేవాడు. పూర్వంలాగానే కులాసాగా కాలం గడిపేవాడు. స్నేహితులను ఇంటికి పిలిచి పేకాడతూ కూచునేవాడు. లేకపోతే తనేక్లబ్బుకు వెళ్ళి స్నేహితులతో సరదాగా కాలక్షేపం చేశేవాడు. కాని ఒకరోజు అతనిభార్య పెద్దతుఫాను తెచ్చి పెట్టింది. ఈ మాట అనొచ్చు అనకూడదని లేకుండా ఇష్టంవచ్చినమాటలన్నీ అనే శింది. తనసంగతి ఎంతమాత్రం పట్టించుకోడంలేదని తిట్లవర్షం కురిపించింది. ఈ హడావుడికి అతను హడలిపోయి భార్యకు లొంగిపోక తప్పిందికాదు. అంటే, ఇంటిదగ్గరే ఉండిపోవలసి వచ్చింది. ఉండిపోతే మాత్రం లాభమేముంది? ఆమె, తనూ పరస్పరం శత్రువుల్లా కూచున్నారు. అతని కిప్పుడు పెండ్లి విషయం పూర్తిగా అర్ధమైపోయింది.పూర్వం పెళ్ళంటేజీవితంలో సుఖశాంతులు అనుభవించడానికి ఒకమార్గం అనీ ఒకసాధనమనీ

అనుకున్నాడు. ఇప్పుడు అలాకాకపోగా జీవితంలో సౌఖ్యంఅనేది ఉంటే దాన్ని భగపరుస్తుందనుకున్నాడు. అంచాత అలాటి ముప్పురాకుండా తన్ను తాను పరిరక్షించుకోవాలనుకున్నాడు. ఇలా తన్నుతాను రక్షించుకోదానికి మార్గాలు వెదకసాగాడు. అతని వ్యక్తిత్వాన్నీ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోడానికి అతనికి ఒక్కటే ఉపాయం దొరికింది. అది తన పదవి. తన పదవిలో, పదవికి సంబంధించిన పనుల్లో అహరహాలు మునిగిపోవడం ద్వారా ఈ గొడవలకు దూరంగా ఉందా మనుకున్నాడు. పైగా తన పదవిద్వారా తన భార్యను లొంగ తీసుకోగలడుకూడా.

ఈలోగా ఇవాన్ఇలిచ్ భార్య కన్నది. సంతానం కలగడం సులభం కావచ్చు కాని, ఆ సంతానాన్ని పెంచి పెద్ద చెయ్యాలంటే ఎంతో కష్టం. ఇందులో ఎన్నో చిక్కులు. తల్లికీ, పిల్లాడికీ జబ్బులు. కొన్ని నిజమైన రోగాలు కొన్ని ఊహించుకున్న రోగాలు. అసమానం తను సానుభూతి చూపుతూ ఉండాలి. ఏ విషయంపట్ల ఎందుకు సానుభూతి చూపాలో అతనికి అర్థమయ్యేదికాదు. ఈ అనుభవాలన్నీ కలిగినతరువాత తన సంసారిక జీవితానికి దూరంగా ఒక ప్రత్యేకమైన జీవితాన్ని నిర్మించుకోవలసిన ఆవశ్యకత మరింత ఎక్కువైంది.

నానాటికీ తన భార్య కోప తాపాలు హెచ్చడం మొదలెట్టాయి. తనకు మనశ్శాంతి లేకుండా పోతోంది. గత్యంతరం కనుపించడంలేదు. రాను రాను తన జీవితాన్నంతా తన ఉద్యోగ వ్యవహారాల్లో కేంద్రీకరించడం మొదలెట్టాడు

ఇవాన్ఇలిచ్. పూర్వంకంటె ఎక్కువగా పనిచేస్తున్నాడు. అతని ఆశలుకూడా పెరిగాయి.

అతని వివాహం జరిగి ఒక సంవత్సరమైంది. అంతే.

సంవత్సరంలోగానే వివాహంయొక్క లోటుపాటులు బాగా తెలిశాయి. వివాహంవల్ల జీవితంలో కొన్ని సుఖాలు కలిగినా, వివాహం మొత్తంమీద చాలా కిష్టమైన కష్టమైన వ్యవహారం. వివాహం చేసుకునికూడా, సంఘంలో అందరూ జీవిస్తున్నట్టు సుఖంగా జీవించాలంటే ఉద్యోగధర్మాలపట్ల ఒక నిర్ణీతదృష్టిని ఎలా అవలంబిస్తామో సంసారంవట్లకూడా అలాగే ఒక నిర్ణీతదృష్టిని అవలంబించాలి.

ఇవాన్ఇలిచ్ తన 'వైవాహికజీవితంపట్ల ఇలాటిదృష్టిని అవలంబించాడు. తన సంసారజీవితంనుంచి తను కోరిన సుఖాలల్లా – ఇంట్లో భోజనం, ఇల్లాలు, పడక, పానం అంతే. పైగా నలుగురూ అనుకునేటట్టుగా తనూ సంసారభారం నిర్వహిస్తున్నాడనే మర్యాద. ఇంతకుతప్ప సంసారజీనితంనుంచి ఇతర సుఖాలు ఆశించేవాడు కాదు. ఈ సుఖాలుదొరికితే సంతోషించేవాడు. పోట్లాటవచ్చే సూచనలు కనుపిస్తే మెల్లగా జారుకుని తన ఉద్యోగప్రపంచంలో మునిగిపోయేవాడు. ఆ ప్రపంచంలో అతనికి సంతృప్తికలిగేది.

మంచి ఉద్యోగిగా ఇవాన్ఇలిచ్ పేరుపొందాడు. మూడుసంవత్సరాల తరువాత అతన్ని ఎసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ చేశారు. అతనికి ఈ కొత్తపదవి మరింత ఆకర్షణీయంగా కనుపించింది. ఉద్యోగధర్మాలు కొత్తవి. ప్రధానమైనవికూడా. ఎవరిమీదైనా కేసుపెట్టి వారిని జైల్లో పెట్ట

డానికి తనకు అధికారాలున్నాయి. తన ఉపన్యాసాలకు గొప్ప ప్రచారం వస్తోంది. అన్నింటిలోనూ తను అపూర్వమైన విజయం సాధిస్తున్నాడు.

ఇది ఇలా ఉండగా తన సంతానంకూడా అధికం కావడం మొదలెట్టింది. తన భార్య గయ్యాళితనంకూడా ఎక్కువైంది. కాని, అతను సంసార జీవితంపట్ల కొత్తవిధానం అవలంబిస్తూ ఉండడంవల్ల వీటిని పట్టించుకోడంలేదు. ఈ గొడవలు అతన్ని చలింపచెయ్యనూలేదు.

ఆఊళ్లో ఏడు సంవత్సరాలు ఉద్యోగం చేసినతరువాత మరో రాష్ట్రానికి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా బదిలీచేశారు. దగ్గర డబ్బు తక్కువగా ఉన్నా, వెళ్ళక తప్పిందికాదు. ఆ ఊరు వదిలి వెళ్ళడం భార్యకు ఇష్టంలేదు. కొత్తపదివికి జీతం పెద్దది. కాని జీవితప్రమాణంకూడా పెరిగింది. పూర్వంకంటె పెద్ద హోదాలో జీవించాలి. ఇంతేకాక ఇద్దరు పిల్లలు చనిపోయారు. సంసార జీవితం అతనికి సుఖరహితంగా కనుపించసాగింది.

కొత్త ఊరు చేరారు. కొత్తఇంట్లో ప్రవేశించారు. ఈ కొత్తయింట్లో తన సుఖానికి కొద్దిపాటి భంగం కలిగినా ప్రాస్కోవ్యా భర్తను నిందించేది. ప్రతి విషయం లోనూ భర్తతో పోట్లాడేది. పిల్లల చదువువిషయం వచ్చినప్పుడు భార్యాభర్తలు దాన్నిగురించి మాట్లాడుకోడం క్షణంలో పోట్లాటగా పరిణమించేది. ఒక్క కామవాంఛ ఇద్దరినీ ఆవేశించినప్పుడు మాత్రమే పోట్లాట ఉండేదికాదు. అలాంటి సమయాలుకూడా తగ్గిపోయాయి. అలాంటి క్షణాలు సముద్రంలో దీవుల్లాంటివి. తుపాను వీస్తున్న సముద్రంలో

ప్రయాణంచేస్తూ ఆ దీవుల్లో కొన్ని క్షణాలపాటు ఆగి విశ్ర మించేవారు మళ్ళీ యాత్ర మొదలెట్టేవారు. ఆ క్షణంలో మాత్రం దగ్గరిగావచ్చి తరువాత ఒకరికొకరు దూరమైపోయే వారు. ఇది అసహజమని అనుకున్నట్లయితే ఈ ఏకాంతవాసాన్ని ఇవాన్‌ఇలిచ్ సహించగలిగి ఉండేవాడుకాదు. కాని ఇది చాలా సహజమనుకున్నాడు. ఈ కల్లోలంనుంచి దూరదూరంగా తప్పు కోడమే అతని ముఖ్యోద్దేశం. అలా తప్పుకున్నప్పుడే అవి నిరుపద్రవంగా కనుపిస్తాయి. అాచాత ఇంటో సాధ్యమైనంత తక్కువకాలం ఉండేవాడు, ఇంట్లో ఉన్న కాసేపూ ఎవరో ఒకరు స్నేహితులను తనతో ఉంచుకునేవాడు. ఇది ఎలాఉన్నా ముఖ్యంగా ఎక్కువకాలం ఉద్యోగ వ్యవహారాలలో గడిపే వాడు. అదేఅతనికి ప్రపంచంగా మారిపోయింది. తనకు గొప్ప అధికారం ఉందనీ తనకు తెలుసు. తలుచుకుంటే ఎవరినైనా ఇట్టే నాశనం చేసెయ్యగలడు.

తను కోర్టులో ప్రవేశిస్తూంటే అందరూ నమ్రతతో లేచి నిల్చుంటారు. కేసులు ఎంతో తెలివితేటలతో చక్కగా విచారిస్తాడు. పై అధికారుల మన్ననా, క్రింది అధికారుల భక్తి కూడా తన సామర్థ్యంవల్ల పొందగలిగాడు, ఇవాన్ ఇలిచ్‌కి తన పదవిలో ఉన్న ఔన్నత్యం బాగా తెలుసు. ఈ ఔన్నత్యం అతనికి ఎంతో సంతృప్తినీ ఆనందాన్నీ ఇచ్చింది. తనకు జీవితం సుఖమయంగా కనుపించేటట్లు చేసింది.

ఇంతేకాక స్నేహితులతో కబుర్లు, డిన్నర్లు, పేకాటలు, మరెన్నో విలాసాలు. కొన్ని కుటుంబ కల్లోలాలున్నా,

మొత్తంమీద అతని జీవితం తను తలచినట్టుగా సుఖంగా శాంతంగానే సాగుతోంది.

ఇలా మరో ఏడు సంవత్సరాలు గడిచాయి. పెద్దమ్మాయికి అప్పుడే పదహారో ఏడు కూడా వచ్చింది. మరో పిల్ల పోయింది, ఒకడే కొడుకు మిగిలాడు. బళ్ళో చదువు కుంటున్నాడు. ఇవాన్ ఇలిచ్ వాణ్ణిలా బళ్ళో వేద్దామనుకున్నాడు. కాని ప్రాస్కోవ్యా ఫెడరొవ్నా హైస్కూల్‌కు పంపించింది. పిల్లకు ఇంట్లోనే చదువు చెప్పిస్తున్నారు. పిల్ల, పిల్లాడు ఇద్దరూ బాగానే చదువుకుంటున్నారు.

# 3

పెండ్లయిన తరువాత పదిహేడు సంవత్సరాలు ఇలా జీవితం గడిపాడు ఇవాన్ ఇలిచ్. అతను పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా స్థిరపడిపోయి చాలాకాలమైంది. ఎన్నో పర్యాయాలు బదిలీ చేస్తామన్నారు. కాని అతను అంగీకరించలేదు. ఇంతకంటె పెద్ద పదవికోసం ఆశిస్తూ ఉన్నాడు. ఇలా ఉండగా, ఒక దురూహ్యమైన దురదృష్టసంఘటన అతని జీవితాన్ని తల్లకిందులు చేసింది. ఒక పెద్ద పట్నంలో ఒక జడ్జీపదవి అతని కిస్తారని అతను ఆశిస్తున్నాడు. కాని ఆపదవి హాపే అనే మరొకనికి ఇచ్చారు. ఇవాన్ ఇలిచ్‌కి చెప్పరానంత కోపం వచ్చింది. హాపేను నిందించాడు, కోపం పట్టలేక అతనితోనూ, తనపై అధికారులతోనూ పోట్లాడాడు. ఇలా పోట్లాడడం అతనికే నష్టం కలిగించింది.

మరికొన్ని కొత్తపదవులు ఖాళీలు వచ్చినప్పుడు అతన్ని పట్టించుకోలేదు.

ఇది జరిగింది 1880 లో. ఇవాన్ ఇలిచ్ జీవితంలో కల్లా ఇది చాలా గడ్డుసంవత్సరం. అన్నివిధాలా అతనిచుట్టూ కష్టాలు ముసురుకున్నాయి. తనకు వచ్చే జీతం కుటుంబానికి సరిపోవడం లేదు. ఖర్చు ఎక్కువై పోతూంది. తన విషయం పై అధికారులు పూర్తిగా విస్మరించారు. తనకు జరిగిన ఘోరమైన అన్యాయం ఇతరుల దృష్టిలో అతి సామాన్యమైన సంఘటనలాగా కనుపిస్తోంది. తన తండ్రికూడా అతన్ని పట్టించుకోడంలేదు. తనకు సహాయపడడం అవసరమని గమనించడంలేదు. ప్రపంచంలో అందరూ తనను వదిలిపెట్టినట్టు, తనకు వ్యతిరేకులైనట్టు భావించసాగాడు ఇవాన్ ఇలిచ్. తనకు తన పదవిలో కనుపిస్తున్న అసంతృప్తి ఇతరులకు కనుపించడంలేదు. తనకు 3500 రూబుల్స్ జీతం వస్తోంది. కాని చాలడంలేదు. ఇది తన దృష్టిలో తన తాహతుకు చాలా తక్కువ. కాని ఇతరుల దృష్టిలో ఇది సర్వసాధారణంగా కనుపిస్తోంది. పైగా ఈ మాత్రం పదవిలో ఉన్నందుకు అతన్ని అందరూ అదృష్టవంతుడంటున్నారు. తన కష్టాలు తనకే తెలుసు. ఇతరులకెలా తెలుస్తాయి? ఏ చెట్టుకు తగిన గాలి ఆ చెట్టుకుంటుంది. తనకు ఎలాటి ఘోరమైన అన్యాయాలు జరిగాయో, తన భార్య తనను ఎలా రాచి రంపాన పెడుతుందో, తన అంతస్తుకుమించి జీవించడం ద్వారా తను ఎన్నెన్ని అప్పులు చేశాడో - ఇవన్నీ ఎవరికి తెలుస్తాయి?

ఆ వేసవిలో కొంత ఖర్చు తగ్గించి కొంత డబ్బు వెనకెయ్యదలచుకున్నాడు ఇవాన్ ఇలిచ్. అంచాత సెలవు తీసుకుని భార్యతో కలిసి తన అన్నగారి గ్రామానికి వెళ్ళాడు.

సెలవు. పనిలేదు. పైగా ఉంటున్నది గ్రామంలో. ఇవాన్ ఇలిచ్‌కి ఏమీ తోచిందికాదు. ఇలా పనిలేకుండా జీవించడం దుస్సాధ్య మనిపించింది. అతనికి అలవాటుకూడాలేదు. ఏదో ఒక తీవ్రమైన మార్పు తీసుకునివస్తే తప్ప ఇక లాభం లేదనుకున్నాడు.

ఒకరోజు రాత్రంతా నిద్ర పట్టలేదు. వరాండాలో అటూ ఇటూ పచార్లుచేస్తూ రాత్రంతా గడిపాడు. చివరకు పీటర్స్‌బర్గ్ వెళ్ళి తన విరోధులను శిక్షింపచేసి మరో మంత్రి వర్గానికి తనను బదిలీ చేయించుకుందామని నిశ్చయించుకున్నాడు.

తన భార్యా, అన్నా అడ్డుచెబుతూఉన్నా, లెక్క చెయ్యకుండా పీటర్స్‌బర్గ్ బయలుదేరాడు. పీటర్స్‌బర్గ్‌కు బయలుదేరడంలో అతనిముఖ్యోద్దేశంఒకటే - సంవత్సరానికి అయిదువేలు రూబుల్స్ జీతం వచ్చే ఉద్యోగం సంపాదించడం. ఏ శాఖైనాసరే, ఏ పద్ధతి ఉద్యోగమైనాసరే - దానితో నిమిత్తం లేదు.

జీతంమాత్రం అంతపెద్దజీతం కావాలి. ఉద్యోగం, పరిపాలనావ్యవహారాల శాఖలో కావచ్చు, బాంకుల్లో కావచ్చు, రైల్వేలో కావచ్చు, మార్యాచక్రవర్తిని పేరట నడిచే సంస్థలలో ఏ సంస్థలోనైనా కావచ్చు - పదవిమాత్రం అంతపెద్ద

పదవి కావాలి. తను ఇంతవరకూ పనిచేసినమంత్రివర్గానికి సంబంధించిన శాఖలోమాత్రం కాకూడదు. ఈ ఉద్దేశంతో అతను పీటర్స్‌బర్గ్ ప్రయాణమైనాడు.

ఇవాన్ఇలిచ్‌యొక్క ఈ అన్వేషణ అనుకోకుండా ఫలించిందికూడా. ఇవాన్ఇలిచ్ మొదటితరగతి పెట్టెలో ప్రయాణంచేస్తున్నాడు. కర్స్‌లో ఇవాన్ఇలిచ్ పరిచయస్తుడైన యఫ్. ఐ. ఇల్యిన్ అదే పెట్టెలో ఎక్కాడు. ఇవాన్ఇలిచ్ ప్రక్కనే కూచుని, మంత్రివర్గంలో జరగనున్న ఒక మార్పును గురించి కర్స్కగవర్నర్‌కు అంతకుముందే ఒక టెలిగ్రాం వచ్చిందని చెప్పాడు. పీటర్ ఇవనొవిచ్ స్థానే ఇవాన్‌సెమనొవిచ్ నియోగింపబడతాడట.

ఈ మార్పు రష్యాకంతకీ సంబంధించిందయినా ఇవాన్ ఇలిచ్‌కికూడా దీనివల్ల ప్రత్యేకమైన లాభం ఉన్నది. ఆ స్థానంలోకి ఒక కొత్తవ్యక్తి రావడంవల్ల, అందులోనూ తత్ఫలితంగా తన స్నేహితుడు జఖార్ఇవనొవిచ్‌కూడా రావడంవల్ల తనకెంతో లాభం ఉన్నది. జఖార్ఇవనొవిచ్ తనకు స్నేహితుడు, సహాధ్యాయుడుకూడా.

మాస్కోలోకూడా ఈ వార్త స్థిరపడిపోయింది. పీటర్స్‌బర్గ్ చేరగానే ఇవాన్‌చ్ ఇవిచ్‌జఖార్ ఇవనొవిచ్‌ని కలుసుకుని అతను పూర్వం పనిచేశిన న్యాయశాఖలో కొత్త పదవికోసం నిశ్చితమైన వాగ్దానం తీసుకున్నాడు. ఒక వారం తరువాత భార్యకు టెలిగ్రాం ఇచ్చాడు.

మంత్రివర్గంలో జరిగిన ఈ మార్పిడివల్ల ఇవాన్ఇవిచ్‌కి అనుకోకుండా కొత్తపదవి దొరికింది. పూర్వం తనతోటి ఉద్యో

గన్ధులకంటె రెండుమెట్లుపైన ఉన్నాడు. 5000 రూబుళ్ళు జీతం. తను పై ఉద్యోగంలోకి మారడంకోసం ఖర్చులక్రింద 3500 రూబుల్స్ ఇచ్చారు. ఇంతటితో అతని పూర్వవిరోధాలన్నీ సమసిపోయాయి. ఇవాన్ ఇలిచ్ పూర్తిగా తృప్తి చెందాడు.

పీటర్స్‌బర్గ్‌లో పనులు ముగించుకొని సంతోషంతో అన్నగారి గ్రామం చేరాడు. ఈవార్త విన్న తరువాత ప్రాస్కోవ్యాఫెడరోవ్‌నా కూడా సంతృప్తిచెందింది. భార్యాభర్తలకు తాత్కాలికంగా సంధి కుదిరింది. పీటర్స్‌బర్గ్‌లో అందరూ తనను ఎంతో ఆప్యాయంగా చూచుకున్నారనీ తనకొత్త పదవి తన పాతవిరోధులందరికీ కంటగింపుగా ఉందనీ, వారందరూ తలలు వంచుకునేట్లు చెయ్యగలిగాననీ చెప్తూ ఇవన్ ఇలిచ్. ప్రాస్కోవ్యాఫెడోరోవ్‌నా ఇదంతా విని నమ్మినట్టుగా నటించింది. భర్త చెప్పిన మాటల్లో ఏదీ కాదనలేదు. తాము, కొత్త ఊళ్ళో సాగించబోయే జీవితాన్ని గూర్చి ప్లానువేసింది. ఆమె ప్లాన్లు అతనికికూడా ఎంతో నచ్చాయి. తనకూ తన భార్యకూ అంగీకారం కుదిరింది. తన జీవితం మధ్యలో ఒక చిన్న తుఫాను వచ్చిపోయింది అంతే. మళ్ళీ తనజీవితం పూర్వం లాగా హాయిగా యథాతథంగా సాగుతుంది.

సెప్టెంబర్ పదో తారీకున అతను ఉద్యోగంలో ప్రవేశించాలి. అంతేకాక తన సామానన్నీ కొత్తఊరు చేర్చి అక్కడ కాపరం స్థిరపరచాలంటే కొంతకాలం పడుతుంది. పైగా కొన్ని కొత్తవస్తువులుకూడా కొనాలి. ప్రాస్కోవ్యాఫెడరోవ్‌నాకూడా వీటన్నిటికీ అంగీకరించింది.

ఇలా అనుకోకుండా అదృష్టం కలిసిరావ,గానే భార్యాభర్తల మధ్య వ్యత్యాసాలు కనుపించకుండా పోయాయి. ఇద్దరి ఉద్దేశాలూ ఒకటి,గానే కనుపిస్తున్నాయి. ఒకరి లోపాలు ఒకరు గమనించడంలేదు. పెళ్ళైన మొదటిరోజుల్లో కంటె ఎక్కువ హాయిగా ఉంటున్నారు. తన కుటుంబాన్ని కూడా తనతోపాటు వెంటనే తీసుకెడదామనుకున్నాడు ఇవాన్ఇలిచ్. కాని తన అన్నగారూ వదినగారూ ఒప్పుకోలేదు. బావమరది కూడా ఒప్పుకోలేదు. వీళ్ళందరూ హఠాత్తుగా మళ్ళీ తనకూ తన కుటుంబానికీ సన్నిహితులైనారు.

కొత్తపదవిని స్వీకరించడానికి ఇవాన్ఇలిచ్ ఒక్కడే వెళ్ళాడు. తనకు అనుకోకుండా కలిసివచ్చిన అదృష్టం, భార్యతో రాజీకుదరడం — ఈ రెండు అతన్ని కొత్తఆనందాలో నింపివేశాయి. కొత్తఊరికి వెళ్ళగానే ఒక చక్కటి ఇల్లు తీసుకున్నాడు. అచ్చంగా తనూ తన భార్య ఊహించినట్టుగానే ఉంది ఆ ఇల్లు. ఇల్లు పెద్దది. అతిథులెవరైనా వస్తే కూచోడానికి రెండు పెద్దహాళ్ళున్నాయి. తను చదువుకోడానికి ఒక పెద్దగది, తన భార్యా, కూతురూ ఉండడానికి ప్రత్యేకంగా వేరువేరు గదులూ, కొడుకు చదువుకోడానికి మరోగదీ, ఉన్నాయి. ఇల్లు తనకెంతో అనుకూలంగా కట్టినట్టుగావుంది. ఇవాన్ ఇలిచ్ తను స్వయంగా గృహాలంకారణలో శ్రద్ధతీసుకున్నాడు. గోడల కంటించే కాగితాలు, ఫర్నిచర్, అన్నీ అతను స్వయంగా చూచుకున్నాడు. ప్రతిదీ తన అభిరుచులకు తగినట్టుగా ఏర్పాటు చేసుకున్నాడు. అలంకరణ సగంపూర్తి అవుతూఉండగనే, తను ఊహించిన దానికంటె ఎంతో చక్కగా ఉన్నట్టు కన్పించ

పాగింది. అంతా పూర్తి అయినతరువాత, ఎంతనాజూగ్గా శోభా వహంగా ఉంటుందో ఊహించగలిగాడు. నిద్రలోకూడా అదే కల. తనూ స్నేహితులూ కలిసి మాట్లాడుకునేగది ఎంతో అందంగా కనుపించింది. ప్రతిరాత్రి పడుకోబోయేముందు తన ఇల్లు ఎంత అందంగా ఉంటుందో ఊహించుకునేవాడు. డ్రాయింగ్ రూమ్ చూచి నప్పుడు ఆరూమ్ పూర్తి అయినతరు వాత ఎలా ఉంటుందో అతనికిస్ఫురించేది. ఒకమూలచలిమంట-ఒక ప్రక్క-స్క్రీన్-అక్క డక్కడా చెదురు చెదురుగా కుర్చీలు-సోఫాలు-కంచువిగ్రహాలు-అన్నీ అతని కళ్ళముందు కనిపించేవి. తనభార్యా తనకూతురూ ఈఅలంకరణ చూచి నిజంగా పొంగి పోతారు. తన అభిరుచులూ వాళ్ళ అభిరుచులూ ఒకటే. ఇంట్లో అలంకరించడానికి కొన్ని పురాతన విగ్రహాలు; మొద లైన వస్తువులుకూడా కష్టపడి సంపాదించాడు. ఇవి అలంక రించడంవల్ల ఇంటికి ఒక జమీందారీ భవనపు ధీమావస్తుంది. తన భార్యకు వ్రాసిన జాబుల్లో ఇదంతా వ్రాయలేదు. ఆమె రాగానే హఠాత్తుగా ఆమెను ఆశ్చర్యపరుద్దామనుకున్నాడు. ఈ గృహాలంకరణ అతన్ని ఎంతో తన్మయుణ్ణిచేసింది. పగలూ రాత్రి అదే ఆలోచన. దీనిముందు తన ఆఫీసుపనులుకూడా పట్ట డంలేదు. కోర్టుకు వెళ్ళినప్పుడుకూడా ఇదే ఆలోచన. ఒక వైపు సెషన్ జరుగుతున్నా మధ్యమధ్యలో పరధ్యానం పట్టుకునేది. ఎలాటి డిజైన్నుండే కర్టెన్లు కొనాలా అని ఆలోచిస్తూ కూచునే వాడు. అన్ని పనులూ తను స్వయంగా చేశేవాడు. సర్దిన ఫర్నిచర్ మళ్ళీ మళ్ళీ సర్దేవాడు. కర్టెన్లు మళ్ళీమళ్ళీ కట్టేవాడు. ఒకమాటు, పనివాడు గోడకు రంగుకాగితాలు అంటిస్తున్నాడు.

వాడికి ఎలా అలంకరించాలో చెబుదామని తనుకూడా నిచ్చెన ఎక్కబోయాడు. ఒక మెట్టెక్కి జారిపడ్డాడు. కాని స్వతహాగా శక్తివంతుడూ, బలశాలీ కావడంవల్ల నిచ్చెన పట్టుకుని వ్రేలాడాడు. కిటికీ గడియ ప్రక్కలకు తగిలింది. గాయం తగిలిన చోట కొద్దిగా నొప్పెట్టింది. కాని నొప్పి వెంటనే పోయింది. భార్యకు, 'పదిహేను సంవత్సరాలు చిన్నవాణ్ణయినట్లుగా భావిస్తున్నాను.' అని ఉత్తరంలో వ్రాశాడు. బాగా హుషారుగా ఆనందంగా ఉంటున్నాడు. సెప్టెంబర్‌కు ఇల్లు సద్దుబాటంతా పూర్తి అవుతుందనుకున్నాడు. కాని అక్టోబర్ వరకూ పట్టింది. గృహాలంకరణ అద్భుతంగా ఉంది. తనే కాక, చూడవచ్చిన వారందరూ అదే అభిప్రాయం వెలిబుచ్చారు.

నిజం ఆలోచిస్తే ఈగృహాలంకరణ అంత గొప్పదేమీ కాదు. సాధారణంగా కొద్దో గొప్పో ఉన్నవారి ఇళ్ళల్లో ఉండే అలంకారాలే ఇవన్నీ. తమకు అంత పెద్ద సంపత్తి లేకపోయినా శ్రీమంతుల్లాగా కనుపించాలనుకునేవారు తమ ఇళ్ళు ఇలా అలంకరిస్తారు. ఫర్నిచర్, క్రోటన్లు, కర్టెన్లు, కంచు విగ్రహాలు – అన్నీ ఉంటాయి. ఒకవర్గంవారు ఇవన్నీ ఇండ్లలో అలంకరించుకుని పైవర్గపువారిలా కనుపించడానికి యత్నిస్తారు. ఇవాన్ ఇల్లుకూడా ఇలాగే ఉంది. ఇందులో పెద్ద విచిత్రమేమీ లేదు. ఇలాటి ఇండ్లు ఇంకా ఎన్నో ఉన్నాయి. కాని అతని కళ్ళకుమాత్రం తన ఇల్లు ఇంద్రభవనంలాగా కనుపిస్తోంది

తన కుటుంబం వచ్చేరోజున వాళ్ళను తీసుకోరావడానికి స్టేషన్‌కు వెళ్ళాడు. స్టేషన్‌నుంచి వారిని ఇంటికి తీసుకుని వచ్చేసరికి ఇల్లు మిలమిలా మెరిసిపోతోంది. ఒక సేవకుడు భక్తి

వినయాలతో హాల్ తలుపు తెరిచాడు. హాల్లో పూలకుండీ లోని పూలగుత్తులు వారిని ఆహ్వానిస్తున్నట్టుగా ఉన్నాయి. డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళారు. 'ఓహ్! ఎంత అందంగా వుంది' అన్నది భార్య. ఇంట్లో ప్రతిగదీ వారికి చూపించాడు. ఆ రోజు అతని ఆనందం ఇంత అంత అని చెప్పడానికి వీల్లేదు. సాయంత్రం టీ తాగడానికి కూచున్నప్పుడు ప్రాస్కో వ్యా ఫెడ రొవ్‌నా ఎన్నో విషయాలు మాట్లాడుతూ అతను నిచ్చెన మీదినుంచి పడడాన్ని గురించి అడిగింది. అతను నవ్వుతూ తనెలా పడ్డాడో చెప్పాడు.

'పడడంమంచిదే. నేను కొంచెం ఆటగాణ్ణికూడా. మరొకడవు ఈ పాటుకు చనిపోయేవాడే. నేనుకాబట్టి తట్టుకో గలిగాను. ఇక్కడ పక్కన కొంచెం దెబ్బ తగిలింది. తాకితే కొంచెం నెప్పిగా ఉంటుంది. చిన్న గాయం, మానిపోతుంది' అన్నాడు.

ఈ విధంగా కొత్త ఇంట్లో నివశించడం మొదలెట్టారు. కొన్నాళ్ళపాటు ఒక ఇంట్లో నివశించిన తరువాత ఒక గది తరుగుబడిందని అనిపించడం మామూలు. వస్తున్న డబ్బు కూడా సరిపోవడంలేదనుకోడం మామూలే. అయినా, హాయి గానే జీవిస్తున్నారు.

మొదట్లో అంతాబాగానేఉంది. మొదట్లోఅంటే ఏర్పా ట్లన్నీ పూర్తికాక మునుపు—కొన్ని వస్తువులు కొనడం కొన్ని కొత్త వస్తువులు చేయించడం, ఫర్నిచర్ మార్చడం— ఈ ఏర్పాట్లు జరుగుతున్నప్పుడు అంతా సుఖంగానే జరిగింది. అప్పుడప్పుడూ భార్యాభర్తలమధ్య చిన్న తగాదాలు రాక

పోలేదు. కాని వెంటనే సమసిపోయాయి. పనుల్లోపడి తగాదాలు మరిచి పోయారు. పనులన్నీ పూర్తి అయిపోయినాయి. పనులు అయిపోవడంవల్ల ఏమీ తోచడంలేదు. కొత్త పరిచయాలు ఏర్పరచుకోడంలో కాలం గడుపుతున్నారు. కొత్త పద్ధతులకూ, కొత్త జీవితానికి అలవాడుపడుతున్నారు. కుటుంబ జీవితం మరింత నిండుగా వృద్ధిచెందుతోంది.

ఇవాన్ ఇలిచ్ ప్రతిరోజూ ఉదయం కోర్టులో గడిపే వాడు. భోజనానికి మాత్రం ఇంటికి వచ్చేవాడు. అప్పుడప్పుడూ కొద్దిగా చిరాకుపడేవాడు. అదైనా ఇంటివిషయంలోనే. ఇల్లు అద్దంలా కనుపించాలి. ఎక్కడైనా ఒక చిన్న కాగితం పీలిక కనుపించినా, టేబుల్ గుడ్డపై కాస్త మాపు కనిపించినా, కిటికీకర్టను కొద్దిగా చిరిగినా అతనికి చెడ్డ చిరాకు కలిగేది. ఇవన్నీ చక్కగా అలంకరించడానికి అతనెంతో శ్రమతీసుకున్నాడు. ఈ చిన్న చిన్న గొడవలు ఉన్నా - మొత్తంమీద జీవితం హాయిగా, సుఖంగా, సాఫీగా అతను ఆశించినట్టే సాగిపోతోంది.

అతని నిత్యకార్యక్రమం ఇలా ఉండేది. ప్రొద్దున తొమ్మిదాటికి నిద్రలేచేవాడు. కాఫీ తీసుకుని కాసేపు పేపర్ చదువుతూ కూచునేవాడు. తరువాత డ్రెస్ మార్చుకుని యూనిఫారం వేసుకుని కోర్టుకు వెళ్ళేవాడు. అక్కడ పని మర చక్రంలాంటిది. పిటిషన్లు, విచారణలు - ఇవన్నీ మామూలు ప్రకారం జరిగిపోయేవి. ఈ వ్యవహారంలో ముఖ్యంగా గమనించవలసిన విషయం మామూలుగా జరిగే ఉద్యోగవ్యవహారాలకు భంగంరాకుండా చూచుకోడమే. అలా చూచుకోకపోతే మామూలుపద్ధతికి భంగం వస్తుంది. వచ్చిపోయే ప్రజలతో

ఉద్యోగరీత్యామాత్రమే సంబంధాలు పెట్టుకోవాలి. అంతకు మించిన సంబంధాలేవీ పెట్టుకోకూడదు. ఉదాహరణకు ఒక విషయాన్ని గురించి ఏవైనా వివరాలు తెలుసుకోవాలని ఒకడు వస్తాడనుకోండి. ఆవిషయం తనకు సంబంధించింది కాకపోతే ఇవాన్ఇలిచ్ అందులో జోక్యం కలిగించుకోడు. తన పదవికి, తన అధికారానికి సంబంధించిన విషయమవుతే, అధికారికంగా స్టాంపుకొట్టిన కాగితంమీద పెట్టడానికి తగిన విషయమవుతే తను చెయ్యదగినదంతా చేస్తాడు. తన అధికారాలకు మించిన విషయంలోమాత్రం ఎలాంటిజోక్యమూ కలిగించుకోడు.

ఇలా ఉండడంవల్ల తను స్నేహపూర్వకంగా ఉన్నట్టూ ఉంటుంది; తన సంబంధ బాంధవ్యాలు చెడనూచెడవు. తన వ్యక్తిగత జీవితాన్నీ, ఉద్యోగిగా తన జీవితాన్నీ వేరు వేరుగా నడపగల ప్రత్యేకమైన శక్తి వుంది ఇవాన్ఇలిచ్‌కి. రెండు జీవితాలనూ కలిపి కలగాపులగం చెయ్యడు. రెండు జీవితాలనూ విడిగా జీవించే శక్తి అతనికుంది. ఒక గొప్ప కళాకారుడిలాగా ఈ విభజన ఎంతో అందంగానూ చెయ్యగలడు. ఒక పాత్రదారి అనేక పాత్రలు ధరించినట్టు అతను ఈ రెండు పాత్రలు ధరించ గలడు. అధికారిగానూ ఉండగలడు. వెంటనే సామాన్య వ్యక్తి లాగాకూడా సంచరించగలడు. ఎంతో హాయిగా, సుఖంగా, ఏమాత్రం చెక్కు చెదరకుండా ఇలా చెయ్యగలిగేవాడు. ఎంతో అభ్యాసంవల్ల కాని, ఇలా చెయ్యగలగడం సాధ్యం కాదు. ఒక్కోసారి అత నిలా చెయ్యడం ఒక కళలా కను పించేది. కోర్టులో విశ్రాంతి సమయంలో సిగరెట్లు కాలుస్తూ కబుర్లు చెబుతూ గడిపేవాడు. టీ తాగడం, కొద్దిగా రాజ

కీయాలను గురించి మాట్లాడుకోడం, కొద్ది పేకాట, కొత్త పదవులు; ఉద్యోగాలనుగురించి చర్చ - ఇలాగడిచేది విశ్రాంతి సమయం. ఇంటికి చేరేసరికి బాగా అలసటగా ఉండేది కాని ఒక విధమైన సంతృప్తికూడా కనుపించేది. ఒక్కోసారి ఇంటికి వెళ్ళేసరికి భార్యా కూతురూ ఎవరినైనా చూడడానికి వెళ్ళే వారు. లేకపోతే ఎవరో అతిథితో మాట్లాడుతూ కూచుని ఉండేవారు. తన కొడుకు బళ్ళోకి వెళ్ళి ఉండేవాడు. అంతా సక్రమంగానే ఉండేది. భోజనంచేసిన తరువాత అతిథు లెవరూ లేకపోతే, తన రోజుల్లో ఎక్కువ ప్రఖ్యాతంగా చర్చింపబడే పుస్తకం కాసేపు చదువుకునేవాడు. సాయంత్రంపూట మళ్ళీ ఆఫీసు పని చూచుకునేవాడు. ఆఫీసు పేపర్లు చదువుకోడం, సాక్షులు చెప్పిన విషయాలు పరిశీలించడం, వాటికి అనుగుణంగా చట్టాన్ని అనువర్తింపచెయ్యడం - మొదలైన విషయాలు చూచుకునేవాడు. ఈ పనులు అంత నిరుత్సాహకరంగా కనుపించేవికావు,ఉత్సాహకరంగానూ కనుపించేవికావు. బ్రిడ్జిఆట ఉంటే ఇదంతా ఎందుకొచ్చిన గొడవ అనిపించేది. ఆటలేనప్పుడు భార్యతో మాట్లాడుతూ కూచోడంకంటె ఇదే నయం. ఇవాన్ఇలిచ్ అప్పుడప్పుడు చిన్న చిన్న విందులు ఇస్తూఉండేవాడు. ఊళ్ళో సాంఘికంగా పెద్ద అంతస్తులో ఉన్న వారిని - స్త్రీలనూ, పురుషులనూ, విందులకు ఆహ్వానించేవాడు. తన డ్రాయింగ్ రూమ్ కూడా ఇతరు లందరి డ్రాయింగ్ రూమ్‌ల్లా ఉండడంచేత తనిచ్చే చిన్న చిన్న విందులుకూడా పెద్దల ఇళ్ళలో విందుల్లా కనుపించేవి.

ఒకమాటు డాన్సుకూడా ఏర్పాటు చేశారు. ఆరోజు విందు ఎంతో చక్కగా జరిగింది. ఇవాన్ ఇలిచే బాగా ఆనందించాడు. కాని, స్వీట్ల విషయంలో తనకూ తన భార్యకూ పెద్ద తగాదా వచ్చింది. ప్రాస్కోవ్యా ఫెడరొవ్నా తను వేరే ఏర్పాట్లు చేసుకుంది. కాని ఇవాన్ ఇలిచ్ అన్నీ పెద్దదుకాణం నుంచి తెప్పించాలని పట్టుబట్టాడు. అవసరమైన స్వీట్లూ, కేకులుకంటె ఎక్కువగా ఆర్డరిచ్చాడు. కొన్ని మిగిలిపోయాయి. నలభై అయిదు రూబుళ్ళు బిల్లయింది. అంచాత తనకూ భార్యకూ పోట్లాటవచ్చింది. పోట్లాట చాలావరకూ వెళ్ళింది. ప్రాస్కోవ్యా ఫెడరొవ్నా అతన్ని తెలివితక్కువవాడనీ అసమర్ధుడనీ దూషించింది. అతను తలపట్టుకుని కూచుని విడాకులిస్తానని బెదిరించాడు.

ఇదంతా ఇలా ఉన్నా, డాన్సుమాత్రం అందంగా హాయిగా జరిగింది. ఊళ్ళో పెద్దలందరూ వచ్చారు. రాజకుమారి ట్రుఫనోవ్వాతో కలిసి ఇవాన్ ఇలిచ్ డాన్సుచేశాడు. "బేర్ మై బర్డెన్" అనే పేరుగల సంస్థను స్థాపించిన ఒక పెద్ద మనిషి చెల్లెలు ఆమె.

ఇవాన్ ఇలిచ్ సుఖాలు రెండు రకాలు. తన ఉద్యోగ వ్యవహారాలకు సంబంధించిన సుఖాలు ఒక రకం. సంఘంలో వినోద విలాసాలకు సంబంధించిన సుఖాలు మరో రకం. ఒక రకం సుఖాలు అతన్ని పై మెట్టుకు తీసుకునిపోతాయి. మరోరకం సుఖాలు అతనికిఆనందాన్నిస్తాయి, కాని, ఇవానిఇలిచ్‌కి అన్నిటికన్న ఎక్కువసుఖం ఇచ్చింది బ్రిడ్జి ఆట. అతనికి బ్రిడ్జిఆటలో కన్పించినంత సుఖం జీవితంలో మర్కెడా కనుపించలేదు జీవి

తంలో ఏలాటి దురదృష్టకరమైన సంఘటన జరిగినప్పటికీ, బ్రిడ్జి ఆట ఆశాకిరణంలా కనుపించేది. అరుపులూ కేకలూ పెట్టని మంచి ఆటగాళ్ళు నలుగురితో కూచుని చక్కటి తెలివి తేటలతో బ్రిడ్జి ఆడుతూంటే అతనికి ఈ ప్రపంచమే కనుపించేది కాదు. ఆట తరువాత భోజనం. ఒక గ్లాసు ద్రాక్షరసం కొద్దో గొప్పో డబ్బొస్తే మరింత హాయిగా నిద్రించేవాడు ఇవాన్ ఇలిచ్. మరింత డబ్బు రావడంకూడా మంచిదికాదు.

ఇలా జరిగిపోతోంది అతని జీవితం. ఊళ్ళో పెద్దలతో సహావాససాహచర్యాలు ఏర్పడ్డాయి. గొప్పవారు వారింటికి రావడం పోవడం జరుగుతోంది. ఈ పరిచయస్థుల విషయంలో తన అభిప్రాయం తన భార్యా కూతుళ్ళ అభిప్రాయాలు ఒకటే. బంధువులకూ స్నేహితులకూ ఎంత ఎడంగా ఉండాలో ఎంత వరకు చనువివ్వాలో వారికి బాగా తెలుసు. కొంతకాలం అయినవాళ్ళూ కానివాళ్ళూ ఎవరెవరో వచ్చేవారు. కాని, తరువాత వారందరూ తగ్గిపోయి, గొప్పవారుమాత్రమే మిగిలి పోయారు.

యువకులు లీసా దగ్గరకు ఎక్కువగా వచ్చేవారు. పెట్రి షెవ్ అనే మాస్ట్రేటు, అతని కుమారుడు డిమిట్రిఇవనోవిచ్, ఆమెపట్ల ఎక్కువగా శ్రద్ధచూపుతున్నారు. ఇవాన్ఇలిచ్ ప్రాస్కోవ్యాఫెడ్రోవ్నాతో ఈ విషయం చెప్పనుకూడా చెప్పాడు. వారికోసం ఒక పార్టీ ఏర్పాటుచేద్దా మన్నాడు.

ఇలా వారి జీవితం హాయిగా జరిగిపోతోంది. పెద్దమార్పులేమీ లేవు. జీవితం మెల్లగా చల్లగా సాగిపోతోంది.

# 4

కుటుంబంలో అందరూ ఆరోగ్యంగానే ఉన్నారు. అప్పుడప్పుడూ ప్రక్కలో కొద్ది నొప్పిగా ఉందనీ, నోట్లో అరుచిగా ఉందనీ అంటూ ఉండేవాడు ఇవాన్ ఇలిచ్.

రానురాను ఈ కొద్దినొప్పి పెద్దదైంది, పెద్దబాధ పెట్టడంలేదు. కాని చిరాకుగానే ఉంది. అతని చిరాకు, నానాటికి ఎక్కువై కోపదారి తనంగా మారుతోంది హాయిగా, సుఖంగా శాంతంగా సాగిపోతున్న తన కుటుంబ జీవితానికి భంగంకలిగిస్తోంది. భార్యా భర్తల మధ్య పోట్లాటలు ఎక్కువౌతున్నాయి. సంసారంలో పూర్వంకనిపిస్తూ వచ్చినహాయి అదృశ్యమౌతూ వుంది. పూర్వం వున్న హుందా పటాటోపంకూడ తగ్గిపోతూ వుంది. మళ్ళీ తరచుగా పోట్లాటలు మొలకెత్తుతున్నాయి. పూర్వం అప్పుడప్పుడైనా భార్యాభర్తలు కలిసిమెలిసిఉండేవారు. ఇప్పుడుఅదీలేదు ఒకరిమొహం చూస్తే మరొకరు మండిపడుతున్నారు. ఇవాన్ఇలిచ్ కోపదారితనం ఎక్కువైపోతోంది. అతన్ని నిందించడానికి ప్రాస్కోవ్యాఫెడరొవ్నాకు ఇది అవకాశంగా దొరికింది. ఎప్పుడూ అతను కోపదారి మనిషి అని అతన్ని నిందించ సాగింది. తను మహా ఇల్లాలు కాబట్టి అలాంటిభర్తతో సరిపెట్టుకుని వస్తున్నానన్నది. ఇలా ఇరవై సంవత్సరాలు ఎన్నో బాధలు భరించానన్నది.

ఇప్పుడు మొలకెత్తిన పోట్లాటలకు అతనేకారణం కావడం నిజమే. భోజనసమయంలో ఎంచాతనో అతనికి పట్టరాని కోపం వచ్చేది. ధుమధుమలాడేవాడు. పులుసువేసుకో

భోస్తూ ఉండగా మరీ కోపంవచ్చేది. దానికి పెద్దకారణంకూడా కనపించేదికాదు. పేట్లో మరకలున్నాయనో, అన్నంసరిగా లేదనో, కొడుకు మోచేయి టేబిల్‌మీద పెట్టాడనో, తన కూతురు తన ఇష్టప్రకారం తలదువ్వుకోలేదనో ఏదో ఒక కారణంపెట్టుకుని కోప్పడేవాడు. దీనికంతా ప్రాస్కోవ్యా ఫెడరొవ్‌నా కారణమని ఆమెను నిందించేవాడు. మొదట్లో ఆమె ఎదురుజవాబులు చెప్పేది. ఒకటి రెండుసార్లు అలా చెబితే అతను ఉగ్రుడైపోయేవాడు. ఎలాగైనా భోజనం ముగిస్తే చాలునని ఆమె మెల్లగా సర్దుకుని ఊరుకుంది. ఈ ఆత్మనిగ్రహం ఎంతో గొప్పదనే నిశ్చయానికి వచ్చింది. తన భర్త వట్టి కోపదారి మనిషి. అనీ తన జీవితం మట్టిపాలుచేస్తున్నాడనే నిశ్చయానికి వచ్చినతరువాత తననుచూచి తనే జాలిపడేది. తనను చూచుకుని తనెంతజాలిపడేదో తన భర్తను అంతగా ద్వేషించేది. అతని చావుకోరుకోడంకూడా మొదలెట్టింది. కాని అతను చనిపోతే జీవితం ఎలాగా అని ఆమెకు భయంకలిగేది. అంచాత అతని చావు కోరుకునేదికాదు. దీనివల్ల ఆమె చిరాకు మరింత హెచ్చయింది. తనంత దురదృష్టవంతురాలు ప్రపంచంలో లేదని భావించసాగింది. అతని చావుకూడా ఆమెను రక్షించలేదు ఆమె తన బాధంతా లోలోపల దాచుకునేది. ఇది ఇవాన్ ఇలిచ్‌కి మరింత కోపకారణమయింది.

ఒక రోజు ఒక పెద్ద పోట్లాట జరిగింది. ఇవాన్ ఇలిచ్ అసభ్యంగా ప్రవర్తించాడు. పోట్లాట కాస్త చల్లారిన తరువాత, తనకు కోపం ఎక్కువగా వచ్చినమాట వాస్తవమేననీ, దానికి కారణం తనకు శరీరంలో స్వస్థతగా ఉండడంలేదనీ చెప్పాడు.

వెంటనే వెళ్ళి ఒక డాక్టర్‌ను చూడమని ఒత్తిడిచేసింది భార్య.

ఇవాన్ ఇలిచ్ డాక్టర్‌ను కలుసుకున్నాడు. అంతా, అతను ఊహించి నట్లుగానే జరిగింది. ఎప్పుడూ అంతే. రాబోయే ప్రమాదాన్ని ముందుగానే ఊహిస్తూ ఉంటాం. డాక్టర్ కోసం చాలాసేపు కాచుకుని ఉండాల్సివచ్చింది. డాక్టర్ తన మామూలు పోజు పెట్టాడు – ఇవాన్ ఇలిచ్ కోర్టుకు వెళ్ళినప్పుడు పెట్టినట్టు. తరువాత పరీక్ష, ఏవో ప్రశ్నలు, సమాధానాలు, ముందుగా జవాబు తెలిసినా అడిగే ప్రశ్నలు – ఇవన్నీ జరిగాయి. 'నీవు నా దగ్గర మందు తీసుకుంటే చాలు. నీ జబ్బు ఇట్టే నయమైపోతుంది' అన్నట్టుగా డాక్టర్ అతని వంక చూచాడు. వ్యవహారం అంతా కోర్టులో జరిగినట్టే. కోర్టులో ఒక నేరస్థుణ్ణి తనెలా చూస్తాడో డాక్టర్ తనను అలాగే చూచాడు.

ఫలాని కారణంవల్ల రోగికి ఫలాని జబ్బు ఉన్నట్టు కనుపిస్తున్నదనీ, ఫలాని పరీక్షద్వారా ఫలాని విధంగా తేల్చ వచ్చనీ డాక్టర్ ఏవేవో చెప్పసాగాడు. ఇవాన్ఇలిచ్‌కి ఈ వ్యాఖ్యానమంతా అనవసరం. అతనికి కావలసిందల్లా ఒక్కటే– తన జబ్బు ప్రాణాపాయ కరమైనదా కాదా?—అని – అంతే. తన జబ్బుపేర్లతో కాని ఆ పేర్ల తీరులతో కాని అతనికి అవసరం లేదు. అది గర్భాశయంలో జబ్బుకావచ్చు, లేకపోతే క్రానిక్ జబ్బు కావచ్చు లేక ఎపెండిసైటిస్ కావచ్చు. ఏదైనా నయం అవుతుందా కాదా అనేదే ముఖ్యమైనప్రశ్న. ఈ సమస్యను డాక్టర్ అద్భుతమైన తెలివి తేటలతో పరిష్కరించాడు. ఒక మాటు మాత్రం కూడా పరీక్షిస్తే జబ్బునుగురించిన కొత్త

లక్షణా లేవైనా ఉంటే అవికూడా తెలుస్తాయన్నాడు. విచారణకు వచ్చిన నేరస్థుల విషయంలో లక్షలసార్లు ఇవాన్ ఇలిచ్ సరిగ్గా ఇలాగే ప్రవర్తించాడు. అతను నేరస్థునివంక చూస్తూ కేసంతా అద్భుతంగా తేల్చివేసినట్టుగా డాక్టర్ కళ్ళజోడులో గుండా తనవంక చూస్తూ తన జబ్బు నిర్ధరించేశాడు. డాక్టర్ చెప్పిన మాటలనుబట్టి జబ్బు ప్రమాదకరమైనదని గ్రహించాడు. డాక్టర్‌కు కాని, ఇతరులకు కాని అంత ప్రమాదకరంగా కనుపించకపోవచ్చు. కాని తనకుమాత్రం ఉత్పాతకరంగాఉంది. ఇలా అనుకోగానే అతనికి మరింత బాధ కలిగింది. తనమీద తనకు జాలి, తనకింత ముప్పు వచ్చినప్పుడు డాక్టర్ దాన్ని శ్రద్ధగా గమనించడంలేదనే బాధ కలిగాయి.

అతను తనబాధ మాత్రం బైటికి వెలిబుచ్చలేదు. నెమ్మదిగా లేచి వెళ్ళి టేబిల్ మీద ఫీజు పెట్టాడు. ఒక్కమాటు బరువుగా నిశ్వసించి, 'మేమురోగులం సాధారణంగా అనుచితమైన ప్రశ్నలు అడుగుతుంటాం. కాని, క్షమించి నాకో విషయం చెప్పండి. ఈ జబ్బు ప్రమాదకరమైన దంటారా ?' అన్నాడు.

డాక్టర్ అతనివంక దృఢంగా కళ్ళజోడులోగుండా చూస్తూ 'అవసరమైన విషయాలన్నీ అప్పుడే చెప్పేశాను. పరీక్షచేసిన తరువాత మరికొన్ని విషయాలు తెలియవచ్చు' అన్నాడు. ఇలాగే తను కోర్టులో నేరస్థులను 'నేరస్థుడా ! నిన్ను అడిగిన ప్రశ్నలకు సరిగా సమాధానంచెప్పు. లేకపోతే కోర్టునుంచి పంపించెయ్యాల్సి వస్తుంది.' అనేవాడు.

ఇవాన్ ఇలిచ్ నెమ్మదిగా బైటపడి తన గుర్రపు బగ్గీలో ఎక్కి ఇంటికి చేరాడు. దారిపొడుగునా డాక్టరు చెప్పిన మాట లన్నీ ఆలోచించుకుంటూ కూచున్నాడు. డాక్టర్‌గారు చెప్పిన పెద్ద శాస్త్రీయపదజాలం ఇవాన్ ఇలిచ్‌కి బోధపడలేదు. దానికి అర్థం ఆలోచిస్తూ కూచున్నాడు. అసలు అతన్ని ముఖ్యంగా బాధిస్తున్న ప్రశ్న.

'నా జబ్బు అపాయకరమైనదా? కాదా?' అని. ఈ ప్రశ్నకు డాక్టర్‌గారి పదజాలంలో జవాబు దొరుకుతుందా లేదా అని అన్వేషిస్తున్నాడు. డాక్టరుగారి మాటలకు అర్థం జబ్బు చాలా అపాయకరమైనదని అతనికి తోచసాగింది. వీధిలో అన్నీ నిరాశపూరితంగా కనుపించడం మొదలెట్టాయి. టాక్సీలు, ఇళ్ళు, బాటసారులు, దుకాణాలు, అన్నిటినీ ఏదో నిరాశ ఆవరించినట్లుగా ఉంది. తన ప్రక్కల్లో నొప్పి డాక్టర్‌గారి మాటలు విన్న తరువాత మరింత ఎక్కువయినట్లుగాఉంది. ఇవాన్ఇలిచ్ దీన్ని ఎంతో క్షోభతో గమనించాడు.

ఇల్లు చేరాడు. భార్యకు జరిగినదంతా చెప్పాడు. ఆమె అంతా విన్నది. ఆమె వింటూండగా మధ్యలో కూతురు వచ్చింది - తల్లితో కలిసి షికారు వెళ్ళడంకోసం. కూతురు వచ్చేసరికి తండ్రి కథంతా చెబుతూఉన్నాడు. ఇహ తనూ కూచుని వినక తప్పిందికాదు. కాని పూర్తిగా వినలేదు. తల్లి కూడా కొండవీటి చాంతాడు లా కనిపిస్తున్న ఈ కథ పూర్తిగా వినలేకపోయింది.

'సరేకాని, మందు సరిగా పుచ్చుకోండి. డాక్టరుగా ఇచ్చిన మందు చీటీ నా కివ్వండి. గెరిసిమ్‌ను మందుల దుకా

ణానికి పంపించి మందు తెప్పిస్తాను' అని తను షికారు వెళ్ళ డానికి ముస్తాబు కావడంకోసం వెళ్ళింది. ఆమె గదిలో ఉన్నంతసేపూ అతనికి ఊపిరి తిప్పుకోడానికికూడా తీరిక చిక్క లేదు. ఆమె బైటికి వెళ్ళగానే ఒక్కమాటు బరువుగానిశ్వసించి,

'అమ్మయ్య! నిజంగా అంత పెద్దజబ్బు కాదేమో' అనుకున్నాడు.

డాక్టర్‌గారి సూచనల ప్రకారం మందు పుచ్చుకోవడం మొదలెట్టాడు. మూత్రపరీక్ష తరువాత డాక్టర్‌గారి సూచనలు కూడా మారాయి. కాని తరువాత మూత్రపరీక్ష చేసినప్పుడు కనుపించిన వ్యాధి లక్షణాలకు విరుద్ధమైన కొత్త లక్షణాలు కనుపించడం మొదలెట్టాయి. డాక్టర్ చెప్పినదానికీ ఈ లక్షణా లకూ ఎలాటిసంబంధమూ లేదు. డాక్టర్ మరిచిపోయి ఉండవచ్చు, లేక పొరబడి ఉండొచ్చు, లేక ఏదో విషయం తనకు చెప్పకుండా దాచి ఉండనూవచ్చు. అయినా, ఇందులో తన తప్పేమీ లేదు. అంచాత ఇవాన్ ఇలిచ్ డాక్టర్‌గారి ఆజ్ఞలను శిరసావహిస్తూనే ఉన్నాడు. మొదట్లో దానివల్ల కొంత మనశ్శాంతి కలిగిందికూడా.

డాక్టర్‌ను చూచి వచ్చిననాటినుంచీ, డాక్టర్‌గారిసూచ నలలు తు. చ. తప్పకుండా అనుసరించడం, ఆయన చెప్పినట్టే మందు పుచ్చుకోడం, తన బాధ ఎలాఉన్నదో చూచు కోడం—ఇవాన్ ఇలిచ్‌కి ముఖ్యమైన కార్యక్రమాలైనాయి. ఇతరుల జబ్బుల విషయంలో కూడా ఎక్కువ శ్రద్ధ వహించడం మొదలెట్టాడు. జబ్బులను గురించి కాని, మరణాల గురించి కాని, జబ్బులు నయంకావడాన్ని గురించి కాని అతనిముందు ఎవరైనా చెబుతూ ఉంటే ఎంతో ఆతురతతో వినేవాడు.

ముఖ్యంగా జబ్బుతన జబ్బులాంటిదవుతే మరింత ఆతురతతో వినేవాడు. ఎన్నెన్నో ప్రశ్నలు వేశేవాడు తను విన్నదంతా తన జబ్బుకు అన్వయించుకుని చూచుకునేవాడు.

నిజానికి ప్రక్కల్లో నొప్పి తగ్గిపోవడంలేదు. బాధ అలాగే ఉంది. బాధ తగ్గుతూ ఉందని భావించడానికి ఎంతో ప్రయత్నించేవాడు. ఇతర ఆందోళనలేమీ లేనప్పుడు ఇలా చెయ్యగలిగేవాడు కాని తన భార్యతో చిన్న పోట్లాట వచ్చినా, ఉద్యోగవిషయంలో చిన్న ఇబ్బందివచ్చినా, బ్రిడ్జ ఆటలో ఓడిపోయినా, ఈ జబ్బు బాధ చటుక్కున జ్ఞాపకం వచ్చేది. పూర్వం ఇలాటి చిన్నచిన్న దురదృష్టసంఘటనలు ఎన్నో భరించాడు. కాని ఇప్పుడు ప్రతిచిన్నసంఘటనా అతన్ని తల్లక్రిందులు చేసేస్తోంది. 'అబ్బ! ఈ మాయదారిగొడవ ఇప్పుడే ఎందుకువచ్చింది చెప్మా? మందుపని చేసినా జబ్బు కాస్త తగ్గుమొహం పట్టిందో లేదో ఈ గొడవ వచ్చిపడుతుంది' అని తన్నుతాను విసుక్కునేవాడు. ఆ సంఘటనమీద అతనికి చెప్పరానికోపం వచ్చేది ఆ ఘటనకు కారకులైనవాళ్ళమీద కూడా కోపంవచ్చేది. తన్ను నలుచుకతింటున్నారనుకునేవాడు. తన కోపాన్ని తను భరించలేకపోయేవాడు. ఇలాటి పరిస్థితుల మీద, పరిస్థితులకు కారకులైనవారిమీద ఘర్షణపడి కోప తాపాలు తెచ్చుకోడంవల్ల తన జబ్బు ఎక్కువవుతుందని అతనికి స్పష్టంగా తెలుసని అనుకోడం పొరబాటు. కాని, అతని ఉద్దేశం పూర్తిగా వేరు. తనకు శాంతికావాలనుకునేవాడు. ఏవిషయం తన శాంతికి హానికలిగిస్తుందో దానికోసమే వెదికే వాడు. తనశాంతికి ఏపాటిభంగం కలిగినా చిరాకుపడేవాడు.

వైద్యగ్రంథాలు చదవడంవల్ల, డాక్టర్లను కలుసుకోవడంవల్ల అతనిపరిస్థితి బాగుకావడానికి బదులు మరింత అధ్వాన్నమయింది. క్రమక్రమంగా జబ్బు హెచ్చుతూ ఉంది. ఎలా హెచ్చుతూ ఉన్నదో కూడా అతను కనిపెట్టలేనంతగా వృద్ధిపొందుతోంది. డాక్టర్ల సలహా అడిగి జబ్బు వృద్ధి అవుతూందని చెబుతున్నారు కాని అతను డాక్టర్లనుసలహా అడగడంమాత్రం మానెయ్యలేదు.

ఆ నెల మరో పెద్ద డక్టర్‌ను కలుసుకున్నాడు. ఈ డాక్టర్‌కూడా మొదటి డాక్టర్ చెప్పిన విషయాలే చెప్పాడు. కాని ప్రశ్నలుమాత్రం మరోరకం ప్రశ్న లడిగాడు. ఈ పెద్ద డాక్టర్‌ను కలుసుకున్నతరువాత ఇవాన్ఇలిచ్ సందేహాలు భయాలు ఎక్కువైనాయి. మళ్ళీ మరో డాక్టర్ దగ్గరికి వెళ్ళి చూపించుకున్నాడు. ఆ డాక్టర్ తన స్నేహితుడికి స్నేహితుడు. అతను పూర్వపు డాక్టర్లిద్దరూ పరీక్షచేసిన విధంగా కాక మరో విధంగా పరీక్షచేసి జబ్బు నయమవుతుందని చెప్పాడు. కాని అతను అడిగిన ప్రశ్నలు ఇవాన్ఇలిచ్ భయాన్ని మరింత ఎక్కువచేశాయి. ఒక హోమోపతిడాక్టర్ ఇవాన్ఇలిచ్ జబ్బు మరోవిధంగా పరీక్షచేసిహోమోపతి మందిచ్చాడు. ఇవాన్ఇలిచ్ ఒక వారంరోజులు ఆ మందు రహస్యంగా తీసుకున్నాడు. ఒక వారంరోజులు మందైతేమాత్రం పూట తప్పకుండా తీసుకున్నాడు. కాని జబ్బు నయమైనట్టు కనిపించలేదు. అతని భయం నానాటికి ఎక్కువ కాసాగింది. ఒకరోజు ఒక స్నేహితురాలు ఒక మంత్ర విగ్రహంద్వారా జబ్బు నయమవుతుందని చెప్పింది. ఇవాన్ఇలిచ్ ఆమె చెప్పినదంతా శ్రద్ధతో విని నమ్మడం మొదలెట్టాడు.

ఈసంఘటన అతనికి మరీ కలవరం కలిగించింది. 'నా మనస్సు ఇంత బలహీనపడి పోయిందా?' అను కున్నాడు. మళ్ళీ కొంత ధైర్యం తెచ్చుకున్నాడు. 'ఛా! ఇలాంటి నరాల బలహీనతకు లోను కాకూడదు. ఏమిటీ మూఢ విశ్వాసాలన్నీ? అర్థం లేదు. డాక్టర్ దగ్గర మందు సరిగా పుచ్చుకుంటే ఏబికూ వుండదు. మందు పుచ్చుకుం టున్నాను. ఇకనాకేం భయం! ఇకనుంచి బుర్రలోకి ఇలాంటి పిచ్చి ఆలోచనలు రానివ్వను. వేసవి వచ్చే వరకూ డాక్టర్ మందు పుచ్చుకుంటాను. అంతే.' అని తనలోతాను చర్చించుకుని నిశ్చయంచేసుకున్నాడు. అతనుఇలానిశ్చయం చేసుకోడ మవుతే సులభంగానే జరిగింది కాని దీన్ని ఆచర ణలోపెట్టడం కష్టసాధ్యం. పక్కలోపోటు మరీ ఎక్కువవు తోంది. 'నానాటికితీసికట్టు నాగంభొట్లు' అన్నట్టుంది. నోట్లో అరుచి కూడా ఎక్కువవు తోంది. నోరు చెడ్డ వాసనేస్తోంది. ఆకలికూడా మందగించింది. శక్తి క్షీణించిపోతోంది. ఇందు లో అసత్యం కాని మోసంకానిఎంతమాత్రం లేదు.

అతనిలో ఏదో ఒక పెద్ద పరివర్తన జరుగుతోంది. ఇంత వరకూ అతను జీవితంలో ఎన్నడూ అనుభవించి ఎర గని ఒక పెద్ద మార్పు జరుగుతోంది. ఇది అతనికి ఒక్కడికే తెలుసు. అతనిచుట్టూవున్న వాళ్ళెవరికీ ఈ భయంకరమైన మార్పు అర్థంకావడంలేదు. వాళ్ళకు ప్రపంచంమామూలు గానే కనుపిస్తోంది. ఇది ఇవాన్ ఇలిచ్‌కి మరింత బాధ కలి గించింది. తన కుటుంబంలో ఒక్కరికీ తన్ను ఆవరించిన ప్రమాదం అర్థం కావడంలేదు, తన భార్యా, కూతురూ,

ముచ్చటగా పచ్చ పచ్చగా తిరుగుతున్నారు, పైగా తను ఇంతగా ఎందుకు బాధ పడుతున్నాడా అనుకుంటున్నారు. తప్పంతా తనదే అయినట్టు భావిస్తున్నారు. వాళ్ళు దాచుకోడానికి యత్నిస్తున్నారు. కాని తను ఒకవిషయం గమనించాడు. వాళ్ళ దోవకు తను అడ్డంగా ఉన్నాడు. తనభార్య కూడా తన విషయం అంత పట్టించుకోవడంలేదు. ఆమె పైకి శ్రద్ధగా వుంటున్నట్టు కనుపిస్తున్నా ఆమెదృష్టి మరో విధంగా ఉండేది. ఎవరైనా కనుపిస్తే ' చూడండీ, ఇవాన్ ఇలిచ్ అందరిలాంటి వాడుకాదు. సరిగ్గా మందువుచ్చుకోడు. ఒక రోజు సరిగామందుపుచ్చుకుని పథ్యం చేస్తాడు. మరో రోజు మానేస్తాడు. ఎప్పుడూ నేను కనిపెట్టి ఉండాలి, లేకపోతే అన్నీ మరిచిపోయి ఒంటిగంట వరకూ పేకాడుతూ నిద్ర కాస్తాడు. ' అంటూ వుండేది.

'ఎప్పుడు ఆడాను? ఒక్కమాటు ఎప్పుడో పీటర్ ఇవనొలిచ్ ఇంటికి వెళ్ళాను' అనేవాడు ఇవాన్ ఇలిచ్.

'నిన్న షెబెస్ ఇంటికి వెళ్ళారు'

'నేను నిద్రపోదామనుకున్నా ఈనొప్పి ఎలాగో నాకు నిద్రపట్టనిచ్చేది కాదు.'

'సరే మీఇష్టం వచ్చినట్టు చేసుకోండి. ఇలా చేస్తే ఇహ జబ్బెలా నయమవుతుంది. పైగా మా దుంప తెగిపోతుంది' అనేది భార్య.

ఇవాన్ ఇలిచ్ జబ్బును గురించి ప్రాసోవ్యాఫెడ్ రోవ్నా అభిప్రాయం ఇది. తప్పంతా అతనిదేనని ఆమె ఉద్దేశం.

ఇంటిగోడవ ఇలా వుంది. ఇహ కోర్టుకు వెళ్ళినప్పుడు అక్కడకూడా అందరూ తన్ను అదోవిధంగా చూస్తున్నట్టు అనుకునేవాడు ఇవాన్ ఇలిచ్. అందరూ తన స్థానం ఎప్పుడు ఖాళీ అవుతుందా అని కాచుకుని ఉన్నట్టుగా ఉండేవారు. తను ఇంతబాధ పడుతూ ఉన్నా, తనను ఎక్కడికోలాక్కుని పోతున్న తనలోని భీకరమైన మార్పు తమ హాస్యానికి ఒక విషయమైనట్టు, స్నేహితులందరూ అతని నిరుత్సాహాన్ని గురించి పరిహాసాలాడే వారు. తన బాధ గమనించేవాళ్ళు కాదు, తనబాధ వారికి హాస్యాస్పదంగా కనుపించేది. ముఖ్యంగా ష్వారెట్జ్ మరీ వేళాకోళం పట్టించేవాడు. పది సంవత్సరాల క్రితం ఇవాన్ ఇలిచ్ కూడా అంతకంటె కులాసాగా ఉండేవాడు.

స్నేహితులు వచ్చేవారు. అందరూ పేకాటకు కూచునేవారు. ముక్కలు పంచేవారు. ఇవాన్ ఇలిచ్ తన చేతిలో పేకముక్కలు చూచుకునేవాడు. డైమండ్లు ఏడు. తన పార్ట్నర్ దగ్గర మరో రెండు డైమండ్ ముక్కలు న్నాయి. ఇక ఆటలో గెలుపుకు సందేహం ఏముంది! కాని సరిగ్గా అదేసమయంలో ఆకస్మికంగా అతనికి తనబాధ జ్ఞాపకం వచ్చేది. నోటిలో అరుచి, తన దుస్థితి, అన్నీ జ్ఞాపకం వచ్చేవి. తన ఆనందమంతా ధ్వంస మయ్యేది.

తన పార్ట్నర్ వంక చూచేవాడు. అతను ముక్కలు తన దగ్గరికి నెట్టేవాడు 'నాచెయ్యి చాచి ముక్కలు తీసుకో లేనంత బలహీనుణ్ణని ఇతను అనుకుంటున్నాడు కాబోలు' అనుకునేవాడు ఇవాన్ ఇలిచ్.

అందరూ అతనికి బాధగా ఉన్నదని గమనించి, 'సీకు అలసటగా ఉంటే ఇక పేకాట మానేద్దాం. కాసేపు విశ్రాంతి తీసుకో' అనేవారు. అంతా నిశ్శబ్దంగా నిరాశగా కూచునేవారు. ఈ నిశ్శబ్దానికి నిరాశకూ తనే కారణమను కునే వాడు. భోజనం తరువాత ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళే వారు. ఇవాన్ ఇలిచ్ ఒంటరిగా మిగిలిపోయేవాడు. తన బతు కంతా కుళ్ళిపోయింది. విషపూరితమై పోయింది. ఇతరుల జీవితాలను కూడా విషపూరితం చేస్తున్నది. ఈ మృత్యు విషం నానాటికీ మరింత దృఢతరంగా అతని నరనరాల్లో కూడుకుంటూ ఉన్నది.

ఇవాన్ ఇలిచ్ భయంతో పడుకోడానికి వెళ్ళేవాడు. రాత్రి చాలాభాగం గడిచే వరకూ నిద్రపట్టేదికాదు. మరు సటి ఉదయం మళ్ళీ నిద్రలేచి దుస్తులు వేసుకుని కోర్టుకు వెళ్ళాలి. అక్కడ మాట్లాడాలి, వ్రాయాలి. ఎక్కడికి వెళ్ళ కుండా ఇంట్లోఉంటే అదిమరీ బాధ. ఇలాఒక పెద్ద అగాధం అంచులో అతను జీవిస్తున్నాడు. అతన్ని అర్థంచేసుకునే వారూ జాలితలచేవారూ ఎవరూలేరు.

## 5

ఇలా కొన్ని నెలలు గడిచాయి. కొత్త సంవత్సరం వచ్చేముందు తనబావమరిది వచ్చాడు. తనఇంట్లోనేమకాం చేశాడు. అతను వచ్చేటప్పటికి ఇవాన్ ఇలిచ్ కోర్టుకువెళ్ళి వున్నాడు. ప్రాస్కోవ్యా ఫెడ్‌రోవ్‌నా ఏవో వస్తువులు కొన డానికి బజారుకు వెళ్ళింది. కోర్టునుంచి యింటికి వచ్చేసరికి

తన బావమరిది సామానులు సర్దుకుంటూ ఉండడం చూశాడు. బావమరది బలిష్టంగా వున్నాడు.

ఇవాన్ ఇలీచ్ అడుగులు చప్పుడు వినపడగానే అతను తలెత్తి, ఒకక్షణం నిశ్చలంగా తనవంక చూచాడు. ఆ చూపు లోని అర్థం వెంటనే ఇవాన్ ఇలీచ్‌కి అవగతమైపోయింది. ఏదో ఒక ఆశ్చర్యార్థకమైన మాట అనబోతున్నట్టుగా తన బావమరిది పెదవులు కదిలించాడు. కాని అనలా. దానిఅర్థం ఇవాన్ ఇలీచ్‌కి తెలుసు.

'నేను చాలా మారానుకదరా ?' అన్నాడు.

'అవును. చాలా మారిపోయావు.'

ఈలోగా ప్రాస్కోవ్యా ఫెడరోవ్‌నా వచ్చింది. అన్న గారు ఆమెతో లోపలికి వెళ్ళాడు. ఇవాన్ ఇలీచ్ తలుపు మూసి అద్దంలో తన ముఖం చూచుకున్నాడు. తనభార్యతో కలిసి ఉన్న ఫోటో ఒకటి వుంది. ఆ ఫోటోతో ఇప్పటి తన ముఖాన్ని పోల్చుకొని చూచుకున్నాడు. ఆనాటికి ఈనాటికి ఏమి సంబంధం లేదు. తన ముఖం పూర్తిగా మారిపోయింది. తనచేతులు చూచుకున్నాడు. ఎంతో శుష్కించి పోయాయి. ఆరాత్రి అతనికి మరింత భయానకంగా కనుపించింది.

'లాభంలేదు. యింక లాభంలేదు.' అనుకుంటూ టేబిల్ దగ్గరకు వెళ్ళి కూచుని కొన్ని లాపేపర్లు చదువుదా మనుకున్నాడు. కాని సాగలేదు.

తలుపు తెరుచుకుని ముందుగదిలోకి వెళ్ళాడు. డ్రాయింగ్ రూమ్ తలుపు మూసిఉంది. మెల్లగా అడుగులు

వేసుకుంటూ తలుపు దగ్గరికి వెళ్ళి నిల్చున్నాడు. లోపల మాటలు వినిపిస్తున్నాయి. 'నీవు గోరంతలు కొండంతలు చేస్తున్నావు' అంటున్నది ప్రాస్కోవ్యా ఫెదరోవ్నా. 'కాదు. నీకు కనుపించడం లేదూ. అతని ముఖం చూడూ-ఎలా పాలిపోయిఉందో - అచ్చం ప్రేతకళపడింది. కళ్ళు చూడు—ఎలా పీక్కుపోయాయో. కాంతిలేదు. అసలు జబ్బేమిటో' అంటున్నాడు ఆమె అన్న.

'ఎవరికీ తెలీదు. ఒక్కొక డాక్టరు ఒక్కొక మాట చెబుతున్నాడు. ఒకరిమాటకూ మరొకరి మాటకూ సంబంధం లేదు.'

ఇవాన్ ఇలిచ్ ఈ మాటలు విని తనగదిలోకి వెళ్ళి పడుకుని ఆలోచించడం మొదలెట్టాడు. డాక్టర్లు తన గర్భాశయ రోగాన్ని గురించి చెప్పినమాటలన్నీ జ్ఞాపకంవచ్చాయి. తన గర్భాశయం విడిపడి తేలుతూ ఉందని చెప్పారు. అతను తన ఊహాప్రపంచంలో దాన్ని పట్టుకుందా మనుకున్నాడు. వెంటనేవెళ్ళి పీటర్ ఇవనోలిచ్‌ని చూదామనుకున్నాడు. గుర్రపుబగ్గీ తయారుచెయ్యమని ఆజ్ఞాపించి బయలు దేరడానికి సిద్ధమైనాడు.

'ఎక్కడికి ప్రయాణం?' అడిగింది భార్య అతనివంక దీనంగా అదోవిధంగా చూస్తూ. ఆ చూపులోని దీనత్వం అతనికి మరింత చిరాకు కలగచేసింది. ఆమెవంక బద్ధకంగా చూస్తూ, 'పీటర్ ఇవనోలిచ్ ఇంటికి' అన్నాడు.

పీటర్ ఇవనొవిచ్ ఇంటికి వెళ్ళాడు. ఇద్దరూ కలిసి డాక్టర్ దగ్గరకు వెళ్ళారు. ఇవాన్ ఇలిచ్ డాక్టర్‌తో చాలా సేపు మాట్లాడాడు.

డాక్టర్ వైద్యదృష్ట్యా పరిశీలించి ఎన్నో విషయాలు చెప్పాడు. ఇవాన్ ఇలిచ్ ఇంటికి భోజనానికి వచ్చేసరికి చాలా ఆలస్యమైంది. భోజనం ముగించి కులాసాగా కబుర్లు చెబుతూ కూచున్నాడు. చాలా సేపువరకు గదిలోకి వెళ్ళి పని చెయ్యలేక పోయాడు. చివరకు ఎలాగైతేనేం, ఓపిక తెచ్చుకుని తన గదిలోకి వెళ్ళి కూచుని అవసరమైన పనులు చూచుకున్నాడు. కాని, అతన్ని కలవరపరుస్తున్న భయం అతనిలో సెలవేస్తూనే ఉంది. డాక్టర్ చెప్పినమాట 'వెర్మిఫారం ఎపెండిక్స్' జ్ఞాపకం వచ్చింది. టీ పుచ్చుకోవడానికి డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాడు అక్కడ ఎందరోఅతిథులు ఉన్నారు. తన కూతురిని ప్రేమిస్తున్న ఎగ్జామినింగ్ మాజిస్ట్రేటు కూడా ఉన్నాడు. అందరూ ఆడుతూ పాడుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. పియానో వాయిస్తూ పాడుతున్నారు. ప్రిస్కొవ్యా ఫెడరొవ్‌నా 'ఇవాన్ ఇలిచ్, ఈ సాయంత్రం కులాసాగా గడిపాడ' న్నది. కాని అతన్ని ఆజబ్బు పేరు వెంటాడుతూనే వుంది. ఒక్క నిముషంకూడా ఆవిషయాన్ని విస్మరించలేకుండా ఉన్నాడు. పదకొండు గంటలకు అతిథులందరి వద్దా సెలవు తీసుకొని పడకగదిలోకి వెళ్ళాడు. అతనికి జబ్బు మొదలైనప్పటి నుంచి ఒకచిన్నగదిలో ఒంటరిగా పడుకొంటున్నాడు. గదిలో పడుకుని ఏదైనా నవల చదువుకుందామని జోలా నవల తెరిచాడు. కాని చదువు

సాగలేదు. ఆలోచనలో పడ్డాడు. అతని భావప్రపంచంలో మళ్ళీ జబ్బు నయమవౌతున్నట్టుగా తోచింది. 'అంతే మనం ప్రకృతికి అనుకూలంగా నడుచుకూ ఉండాలి. నయంకాక ఏమవౌతుంది!' అనుకున్నాడు. మందు తీసుకోవాలని జ్ఞాపకం వచ్చి లేచివెళ్ళి మందు తీసుకున్నాడు. వెళ్లికిలా పడుకుని మందు ఎలా పనిచేస్తుందో గమనించసాగాడు. 'ప్రతిపూట మందు పుచ్చుకోవాలి. ప్రమాదకరమైన ప్రభావాలను దూరంగావుండాలి. అప్పుడే కులాసా చిక్కినట్టు కనుపిస్తూవుంది.' అనుకున్నాడు. తనప్రక్కలు తాకి చూచుకున్నాడు. తాకితే అంత బాధగా ఉన్నట్టు కనుపించ లేదు. 'అప్పుడే నయమవుతోంది. నయమవు తోంది.' అనుకున్నాడు. అతను ఇలా అనుకుంటూ ఉండగానే మళ్ళీ బాకు పోటులా బాధ మొదలుపెట్టింది. నోట్లోఅరుచి ప్రారంభించింది. 'అయ్యో! భగవంతుడా! మళ్ళీ బాధ!' అనుకున్నాడు.

'మళ్ళీ బాధ! ఈ జబ్బు నయమయ్యేట్టులేదు' అనుకున్నాడు. అతని హృదయం లోలోపల కుంగిపోయింది. భయం ఆవరించింది. అతనిజబ్బు మరోరూపంలో గోచరించసాగింది 'వెర్మిఫారంఎపెండిక్సు కాదు, గర్భాశయరోగమూ కాదు. ఇది కేవలం జీవన్మరణ సంఘర్షణ' అనుకున్నాడు. 'ప్రాణం పోతూఉంది మృత్యువువైపుకు ప్రయాణం సాగిస్తోంది. అవును. ఇందులో అసత్యం కాని మోసం కాని ఎంత మాత్రం లేదు. నేను చనిపోబోతున్నానని నాకుతప్ప అందరికీ తెలుసు. జీవితం నా చేతుల్లోంచి జారిపోతోంది.

ఇక నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. ఏ క్షణంలోనైనా నేను చనిపోవచ్చు. ఒకప్పుడు వెలుగుండేది. ఇప్పుడంతా చీకటి. ఇప్పుడు నేనిక్కడున్నాను. మరోచోటికి వెళ్ళిపోతున్నాను. ఎక్కడికో వెళ్ళిపోతున్నాను.

ఎక్కడికి? ఎక్కడికి? అని భావించసాగాడు. అతని ఒళ్ళంతా భయోత్పాతంతో చల్లబడినట్టయింది. ఊపిరి సలపడం లేదు, గుండెమాత్రం కొట్టుకుంటోంది.

'నేను మరణించిన తరువాత మిగిలేదేమిటి? నేను చనిపోయిన తరువాత ఎక్కడికి పోతాను? మృత్యువంటే ఇదేనా? మృత్యువు! అబ్బ! నేను భరించలేను' అతను ప్రక్కమీద ఎగిరికూచున్నాడు. దీపం వెలిగించబోయాడు. వ్రేళ్ళు వణుకుతున్నాయి. దీపం వెలిగించకుండానే మళ్ళీ కిందపెట్టి పడుకున్నాడు.

'దీపం వెలిగించి ఏం లాభం? వెలిగించినా ఒకటే; వెలిగించక పోయినా ఒకటే' అనుకున్నాడు. విప్పారిన కండ్లతో చీకటిలోకి చూస్తూ పడుకున్నాడు.

మృత్యువు! అవును. మృత్యువే. ఎవరికీ తెలీదు. ఎవరూ అర్థంచేసుకోరు. అర్థంచేసుకోడానికి ప్రయత్నించరు. నన్ను జాలి తలచరు. ఒకవైపు నేనిలా చనిపోతూ ఉంటే ఆడుతూ పాడుతున్నారు.

తలుపుసందులో నుంచి దూరంగా పియానోపాట విన్నాడు. 'వాళ్ళూ చనిపోతారు. బుద్ధిహీనులు! వాళ్ళచావు వాళ్ళకు తెలీదు. ఏమైనా నేను మొదట చనిపోతాను. ఆడుతూ పాడుతున్నారు! పశువులు!' అని కలవరించసాగాడు.

కోపం అతని గొంతుకలో విషచక్రంలా తిరిగింది. అతన్ని బాధ కొండశిలువలా చుట్టేశింది.

'మనుష్యులందరినీ ఈ మృత్యువు కబళించడం ఘోరం!' అనుకుని లేచికూచున్నాడు.

'ఇందులో ఏదో దోషం ఉంది. నెమ్మదిగా ప్రశాంతంగా ఆలోచించుకోవాలి,' అనుకుని ఆలోచన చెయ్యడం మొదలెట్టాడు.

'మొట్టమొదట నా జబ్బు ఎలా ప్రారంభించింది? నిశ్చ్వాస ఎక్కుతూ జారిపడ్డాను. నా ప్రక్క కిటికీకి తగిలింది. ఆ రోజూ మరుసటి రోజు కూడా బాగానేఉన్నాను. కొద్దిగా నొప్పెట్టింది, అంతే. తరువాత డాక్టర్ల దగ్గరికి వెళ్లాను. వాళ్ళు ఏవేవో పెద్దపెద్ద కబుర్లు చెప్పారు. నా బాధ తగ్గక పోగా ఎక్కువైంది. అగాధం దాపుకు వెళ్లాను. నా శక్తి నానాటికీ క్షీణించింది. మృత్యువునన్ను లాక్కుంటోంది. క్రుంగి కృశించి పోయాను. కళ్ళలో కాంతి నశించింది. ఇంతకంటె మృత్యువంటే మరెలా ఉంటుంది? మృత్యువు! మృత్యువంటే ఇదేనా!' అతన్ని భయం దెయ్యంలా పట్టుకుంది. ఊపిరిసలపడంలేదు. మోచేతిమీదముందుకు వంగిఅగ్గిపుల్లల కోసం వెదికాడు. మోచేయి పక్కలకు తగిలి నొప్పెట్టింది. అతనికి కోపంవచ్చి మళ్ళీ గట్టిగా తనే నొక్కుకున్నాడు. ఊపిరి పోయినంత పనయింది. తీవ్రమయిన బాధతో వెల్లికిలా పడుకుని మృత్యువును ఆహ్వానించాడు.

ఈలోగా అతిథులు వెళ్ళిపోతున్నారు. ప్రాస్కోవ్యా ఫెడరోవ్నా వారికి వీడ్కోలు నిస్తోంది. ఏదో పడినట్టు చప్పుడు విని లోపలికివచ్చింది.

'ఏంజరిగింది ?'

'ఏంలేదు. పక్కనున్న టేబిల్ తగిలింది.' ఆమె బైటికి వెళ్ళి దీపంతీసుకుని వచ్చింది. ఒకమైలు పరుగెత్తిన మనిషిలా రొప్పుతూ పడుకుని ఉన్నాడు. ఆమెవంక నిశ్చలంగా చూచాడు.

'ఏంజరిగింది ?'

'ఏమీలేదు. ఏ...మీ...లే...దు.'

ఆమెకు చెప్పి లాభంలేదు. చెప్పినా అర్థంకాదు. ఆమె దీపం వెలిగించి మళ్ళీబైటకు వెళ్ళింది. తిరిగివచ్చేసరికి అతను పైకప్పుచూస్తూ పడుకుని ఉన్నాడు.

'ఏం జరిగింది? బాధగా వుందా?'

'అవును.'

ఆమె పక్కనే కూచుంది.

'లెస్చెటిస్కీని పిలిపించి చూపించడం మంచిదనుకుంటాను,' అన్నది.

అతను పెద్దస్పెషలిష్టు. అతన్ని పిలిపించమంటే పెద్ద ఖర్చన్నమాట. అతను మలినంగా నవ్వుతూ 'అక్కర్లేదు' అన్నాడు.

ఆమె మరికొంతసేపు అలాగే కూచుని అతని దగ్గరకు వెళ్ళి నుదుటిపై ముద్దాడింది. ఆమె అలా ముద్దాడుతూ

ఉన్నప్పుడు అతనికి తీవ్రమయిన ద్వేషం, అసహ్యం కలిగాయి. ఎంతోకష్టంమీద ఆమెను నెట్టెయ్యకుండా వుండగలిగాడు.

'నిద్రపొండి. ఎలాగోలాగా నిద్రపొండి.' అన్నది.

'ఊ'

# 6

తనను క్రమ క్రమంగా మృత్యువు కబళించడం ఇవాన్ ఇలిచ్ గ్రహించాడు. అతని బాధ ఇంతా అంతా అని చెప్పడానికి వీల్లేదు. అతని అంతరాంతరాల్లో అతనికి చనిపోతున్నానని తెలుసు కాని ఆవిషయం అర్థంకాదు. అర్థంచేసుకోలేడు కూడా.

అతను చిన్నతనంలో తర్కశాస్త్రంలో ఇలాచదువుకున్నాడు: 'కెయస్. మానవుడు. మానవు లందరూచనిపోతారు. కాబట్టికెయస్‌కూడా చనిపోతాడు' ఇదిఒక్క కెయస్ విషయంలోనే సత్యమని అనుకుండేవాడు. తనకు ఎన్నడూ అన్వయించుకునేవాడు కాదు. ఆకెయస్ ఎవరు? ఎవరోఅదృశ్యవ్యక్తి. అతనికి మరణం తప్పనిమాట నిజమే. కాని తను కెయస్ కాడు. ఒక కల్పిత వ్యక్తి కాదు. ఇతరులకూ తనకు చాలా తేడావుంది.

అతను ఒకప్పుడు చిన్న కుర్రాడుగా ఉన్నాడు. వాన్యా వాన్యా అనిపిలిచేవారు. తల్లిపొత్తిళ్ళలో పెరిగాడు. తండ్రి దగ్గర ఆడు కున్నాడు. మిట్యాతో, వొలొడ్యాతో, కోచ్‌మన్‌తో, నర్సుతో అందరి కలిసి ఒకప్పుడు ఆట

లాడుకున్నాడు. తరువాత కాటింకాతో ఆడుకున్నా. సుఖ దుఃఖాలు పంచుకున్నాడు. శైశవ క్రీడల్లోని మాధుర్యాన్ని చవిచూచాడు. బాల్యంలోని యౌవనంలోని అందచందాలు అందుకున్నాడు. తను ఈజీవితాన్నంతా అనుభవించాడు. కాని కెయస్ అనుభవించాడా? లేదు. కెయస్ కల్పిత వ్యక్తి. తర్కశాస్త్ర రచయితలు ఒక సిద్ధాంతాన్ని రుజువు చెయ్యడానికి వ్రాసిన ఒక వ్యాసంలో ఒక కల్పిత వ్యక్తి పేరు కెయస్. అంతే. చిన్నతనంలో కెయస్ తనలా బంతి ఆడుకున్నాడా? తనలా తల్లిపాత్రితో పెరిగాడా? తల్లిఒళ్ళో నిదురించాడా? తల్లిచెయ్యి ముద్దాడాడా? ఒళ్ళో తనలా అల్లరి ఉల్లరగా గల్లంతు చేశాడా? తనలా ఒకస్త్రీని ప్రేమించి వివాహం చేసుకున్నాడా? కోర్టుకువెళ్ళి ఉద్యోగం చేశాడా? లేదు. కెయస్‌కు ఈ అనుభవాలేమీ లేవు. ఇవాన్ ఇలిచ్ మనస్సులో ఈ ఆలోచనలన్నీ జలపాతంలా కురిశాయి. కెయస్‌కు మరణంతప్పదు నిజమే. అతను మరణించడంలో తప్పులేదు. కాని నాకు— ఇవాన్ ఇలిచ్‌కి —పుట్టి పెరిగి ఆడిపాడి, చదువుకొని, ప్రేమించి పెళ్ళి చేసుకుని సంసారం చేస్తూ బతుకుతున్న నాకు— ఈభావాలు, అనుభవాలు, ఉద్రేకాలు, గల నాకు మరణం తప్పదా? నావిషయంవేరు. కెయస్ విషయం వేరు. నేను చనిపోవటం ఘోరం అనుకున్నాడు, ఇవాన్ ఇలిచ్. అతనిఉద్దేశ్యం ఇది: 'కెయస్‌లాగా నాకూ మృత్యువు తప్పకపోతే, మృత్యువు తప్పదని నాకు తెలిసి వుండాల్సింది. నాఅంతర్వాణినాకు ఆవిధంగా చెప్పి వుండేది. కాని నాకెప్పుడూ అంతర్వాణి అలా చెప్పలేదు.

నేనుకాని, నాస్నేహితులుకాని ఎవరూ అలా అనుకోలేదు. కాని మృత్యువు మెడమీదకు వచ్చి కూచుంది. ఇక ఏం చెయ్యాలి! ఎంతఘోరం!

అతనికి ఈ వైరుధ్యం అర్థంకాలేదు. భీకరమైన, జుగుప్సాకరమైన ఈ మృత్యుభావాన్ని తన మనస్సులోనుంచి తుడిచేసుకుని, ఆరోగ్యకరమైన, అందమైన భావాలు ఆలోచిద్దామని యత్నించాడు. కాని ఎన్ని మంత్రాలకూ వదలని దెయ్యంలా అదేభావం తనముందు భీకరస్వరూపంతో నిల్చునేది.

ఈ ఆలోచన పారద్రోలడానికి ఇతర విషయాలెన్నో ఆలోచించడం మొదలెట్టాడు. ఈ మృత్యువును గూర్చిన ఆలోచన తనకు రాకముందు పూర్వం అతను ఆలోచిస్తూ వచ్చిన భావప్రవంతిని మళ్ళీ పూరించుకో సాగాడు. తనలో తాను ఇలా అనుకునేవాడు: మళ్ళీ నా ఉద్యోగ బాధ్యతలు స్వీకరిస్తాను. ఇంతకాలం నా జీవితాన్ని సుఖమయం చేసినవి అవే! అప్పుడు ఈ సందేహాలేవీ తనను బాధించవు. కోర్టుకు పోతాడు. తన సహచరులతో మాట్లాడుతాడు, మళ్ళీ తన కుర్చీమీద తను కూచుంటాడు, వచ్చిపోయే జనసందోహాన్ని పరిశీలిస్తాడు

ఒక ఉద్యోగి దగ్గరనుంచి తన ఆఫీసు కాగితాలు పుచ్చుకుంటూ అతని చెవిలో రహస్యంగా ఏదో చెబుతాడు. తరువాత, వెంటనే ధీమాగా కుర్చీలో కూచుని విచారణ ప్రారంభిస్తూ ఏవో మాటలు చెబుతాడు. విచారణ సాగుతూ ఉంటుంది. విచారణ ఎలాంటి స్థితిలో ఉన్నా, మళ్ళీ పక్కల్లో

నొప్పి తనను బాధించడం మొదలెడుతుంది. రానున్న మృత్యుమూర్తి తన ముందుకు వచ్చి నిల్చుంటుంది. అతని నరనరాల్లో భయం ఆవరిస్తుంది. కళ్ళల్లో కాంతి నశిస్తుంది. తను దాన్ని పారద్రోలాలని ప్రయత్నిస్తాడు. కాని లాభం లేక పోతుంది.

'నేనొక్కటే' నిజమన్నట్టు మృత్యువు తనముందు స్థిరంగా నిల్చుంటుంది. అతనిముఖంలో కత్తివేసినా నెత్తురు చుక్క లేకుండా పోతుంది. మాటలు తడబడుతాయి. తన తెలివితేటలు మాయమై పోతాయి. గాభరాపడి పోతాడు. విచారణలో తప్పులు వస్తాయి. తన సహచరులూ తనక్రింది ఆఫీసర్లూ తనవంక ఆశ్చర్యంతో చూస్తారు. ఇంత తెలివి గలవాడు ఇలాఅయిపోతున్నాడేమిటి? అని ఆశ్చర్యపోతారు. మళ్ళీ ధైర్యం పుంజుకుని విచారణ పూర్తి చెయ్యడానికి యత్నిస్తాడు. విచారంతో ఇల్లు చేరుతాడు. ఈ ఆఫీసు పనులు తనకు ఆ విషయం జ్ఞాపకం రాకుండా రక్షిస్తా యను కున్నాడు. కాని లాభంలేక పోతుంది. ఆ 'శక్తి' అతన్ని లాగేస్తోంది. తనవంక సూటిగా చూడమని ఆజ్ఞాపిస్తోంది. ఈ ఘోరపరిస్థితి నుంచి గత్యంతరం కనుపించడం లేదు. ఈ పరిస్థితి నుంచి తన్ను తాను రక్షించుకోడానికి ఇవాన్ ఇలిచ్ ఎన్నెన్నో ప్రయత్నాలు చేశాడు, కొత్తకొత్త మార్గాల కోసం వెదికాడు. అలాంటి మార్గాలు కొద్దిసేపు అతనికి ఓదార్పు కలిగిస్తున్నట్టు కనుపించేవి. కాని వెంటనే మటుమాయమై పోయేవి. మృత్యుశక్తి ఒక్కటే ఆ అడ్డు

తెరలన్నీ చీల్చుకుని తనముందు ప్రత్యక్షమయ్యేది. దాన్ని అడ్డే తెర ఎక్కడా లేదు.

ఈ అంతిమ దినాలలో అతను తన డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళేవాడు. ఒకప్పుడు ఆ డ్రాయింగ్ రూమ్‌నే తను ఎంతో అందంగా అలంకరించాడు ఆ డ్రాయింగ్ రూమ్‌లోనే తను జారిపడడం, తనజబ్బు ప్రారంభించడం జరిగింది. తన డ్రాయింగ్ రూమ్ కోసం తన జీవితాన్ని అహుతి చేశానను కున్నాడు ఇవాన్ ఇలిచ్. అతను డ్రాయింగ్ రూమ్‌లోకి ప్రవేశించగానే తళతళా పాలిష్ పెట్టి మెరుస్తున్న టేబిల్ మీాద ఏదో గీర కనుపించేది. ఆగీర ఎందుకు పడిందాఅని అటూ ఇటూ వెదికేవాడు. చుట్టూఉన్న కంచు తొడుగు రాపిడివల్ల ఆగీర ఏర్పడి ఉండొచ్చు. లేక, ఒక ఆల్బం టేబిల్ మీాద పెట్టాడు. దానివల్లకూడా కావచ్చు. ఆఆల్బం ఎంతో ఖరీదుపెట్టి కొన్నాడు. ఎంతో అందంగా అలంకరించుకున్నాడు. అలాటి ఆల్బం తన కూతురూ, ఆమె స్నేహితులూ తమ యిష్టం వచ్చినట్టుగావాడి పాడుచేశారు.

ఇవాన్ ఇలిచ్‌కి వాళ్ళ అజాగ్రత విసుగెత్తించేది. ఆల్బం అక్కడక్కడా చినిగి వుంది. కొన్ని ఫోటోలు తల్లకిందులుగా ఉన్నాయి. మళ్ళీ ఆల్బం జాగ్రత్తగా సర్ది పెట్టేవాడు. అప్పుడు అతనికి చటుక్కున ఒక ఉపాయం తట్టేది. ఈ వస్తువులన్నీ గదిలో మరోమూాలకు సర్దాలని. సేవకుణ్ణి పిలిచేవాడు. తనుపిలిస్తే భార్యా, కూతురూకూడా వస్తారు. భార్య తన అభిప్రాయానికి ఎదురుచెబుతుంది. తనుపోట్లాడక తప్పదు. తనకు కోపంవస్తుంది.

తనంతట తానే వస్తువులు సర్దుతో ఉంటే 'మీా రెం దుకు సర్దుతారూ? సేవకులు లేరూ? మళ్ళీ మూకు దెబ్బ తగులుతుందేమో.' అంటుంది భార్య. 'భార్య ఈమాట అన గానే అతనిముందు మళ్ళీ మృత్యువు ప్రత్యక్షమై నిల్చుంది. అది ఒక మెరుపులాగా క్షణకాలం మెరిసి మాసి పోతుందను కున్నాడు. కాని అది అలాగే ఉత్సవ విగ్రహంలా కూచుని వుంది. ఇక దాన్ని విస్మరించడం అసాధ్యం. పూలకుండ్ల వెనకాలనుంచి తనవంక చూచి నవ్వుతోంది. 'అదే. అదే.' అతను భయకంపితుడై తనగదిలోకి వెళ్ళి పడుకున్నాడు. అక్కడకూడా అదే. అదే ప్రత్యక్షమైంది. ఇక మరోమార్గం లేదు. దానివంక చూచి కంపించి పోవలసిందే.

# 7

ఇవాన్ ఇలిచ్ జబ్బు ప్రారంభించి మూడో నెల జరు గుతోంది. తన భార్యా, కూతురూ, కొడుకు, బంధువులు, డాక్టర్లు, సేవకులు, తను,—అందరిసీ బాధ పెడుతున్న విష యం ఒక్కటే —తను ఎప్పుడు తన స్థానం ఖాళీచేసి అంద రికీ అవస్థగానున్న తన ఉనికి నుంచి విముక్తి కలిగిస్తాడా అని. అప్పుడు తనకూ ఏ బాధా వుండదు. అలా అందరూ ఎంచేత అనుకుంటున్నారో అతనికే తెలీదు. ఈమూాడు నెలల్లో ఈ మార్పు ఎలా వచ్చిందో చెప్పడం దుస్సాధ్యం.

రాను రాను, అతనికి సరిగా నిద్రపట్టడం తగ్గింది! మత్తుకోసం నల్లమందు, మార్ఫియా ఇంజెక్షన్లూ తీసుకుంటు న్నాడు కాని, దీనివల్లా అతనికి లాభం కనుపించడం లేదు.

మొదట్లో కొంచెం హాయిగా ఉన్నట్టు కనుపించింది. కాని తరువాత, ఉన్న బాధకంటె ఉపరి బాధగా కనుపించింది.

డాక్టర్లు ఆదేశించిన ప్రకారం ప్రత్యేకమైన ఆహారం పుచ్చుకుంటున్నాడు. రాను రాను అరుచి, ఆహారంమీద అసహ్యం ఎక్కువైనాయి.

మలమూత్ర విసర్జనకోసం ప్రత్యేకమైన ఏర్పాట్లు చేశారు. ఇది అతనికి పెద్ద బాధగా కనుపించ సాగింది. ఈ అపరిశుభ్రత, దుర్వాసన అతనికి మరింత కంటగింపుగా ఉన్నాయి. ఇలాటి విషయాల్లో మరొకరు తనకు చాకిరీ చెయ్యడం మరీ అసహ్యం.

కాని, ఈ నికృష్ట విషయంలోనే అతనికి ఒక చిన్న ఓదార్పు కనుపించింది. గెరసిమ్ అనే కుర్రాడు తనమూత్ర పురీషాలు బైట పారేస్తూ ఉండేవాడు. గెరసిమ్ రైతుబిడ్డ. పరిశుభ్రంగా ఉంటాడు. అతని ముఖం ఎప్పుడూ నవ్వుతూ కులాసాగా ఉంటుంది. రష్యాలో రైతులు ధరించే పరిశుభ్రమైన దుస్తులు ధరించి ఆ కుర్రాడు ఇలాటి పాడుపని చెయ్యడం ఇవాన్ ఇలిచ్ కి కొంచెం బాధగా ఉండేది.

ఒకమాటు ఇవాన్ ఇలిచ్ కమోడ్ మీదినుంచి లేచి, లాగు వేసుకునేశక్తి చాలక అలాగే పడకకుర్చీలో కూలబడి పోయాడు. నగ్నంగా ఉన్న తన తొడలవంక చూచుకున్నాడు. శుష్కించి ఎండిన అరటాకుల్లా కనుపిస్తున్నాయి. అతనికి భయం వేసింది.

గెరసిమ్ మెల్లగా అడుగులు వేసుకుంటూ గదిలోకి వచ్చాడు. 'గెరసిమ్!' పిలిచాడు ఇవాన్ ఇలిచ్ శుష్క

స్వరంతో. గెరసిమ్ ఎంతో ఆరోగ్యంగా కనుపిస్తున్నాడు. బరువుగా ఉన్న అతనిబూట్లు తారు వాసనేస్తున్నాయి. పైకి మడిచిన షర్ట్ చేతుల్లో గుండా బలిష్ఠంగాఉన్న అతని చేతులు కనుపిస్తున్నాయి. జబ్బుగా ఉన్న తన యజమాని ఏమనుకుంటాడో అని అటు చూడకుండా కమోడ్ దగ్గరకు వెళ్ళాడు.

'గెరసిమ్' పిలిచాడు ఇవాన్ ఇలిచ్ శుష్క-స్వరంతో.

గెరసిమ్ ఉలిక్కిపడి యజమానివంక చూచాడు. తనే మైనా తప్పు చేశానేమో అనుకున్నాడు.

'అయ్యా!' అన్నాడు.

'గెరసిమ్! ఈపని నీకు చాలా బాధాకరంగా ఉంటుంది. నన్ను క్షమిస్తావు కదూ! అసహాయ స్థితిలో ఉన్నాను.' అన్నాడు ఇవాన్ఇలిచ్.

'పరవాలేదయ్యా! తమకు జబ్బుగావుంది' అన్నాడు గెరిసిమ్. ఇలా అని తనపని తాను చేసుకపోయాడు. కాసే పాగి మళ్ళీ మెల్లని అడుగులు వేసుకుంటూ తిరిగివచ్చాడు.

ఇవాన్ఇలిచ్ ఇంకా అదే కుర్చీలో పడుకుని ఉన్నాడు.

'గెరసిమ్!' మళ్ళీ పిలిచాడు.

'ఇలారా'

గెరసిమ్ దగ్గరికి వెళ్ళాడు.

'నన్ను కొంచెం లేవతీయి. లేవలేకుండా ఉన్నాను.'

గెరసిమ్ బలంగా వున్న తన చేతులతో యజమానిని చల్లగా లేవదీసి లాగు తొడిగాడు. మెల్లగా సోఫాదగ్గరకు చేర్చమని అడిగాడు ఇవాన్ఇలిచ్. గెరసిమ్ అతన్ని మెల్లగా సోఫాలో పడుకోబెట్టాడు.

'థాంక్ యూ, ఎంతచల్లగాచేర్చావు నన్ను!' అన్నాడు ఇవాన్ఇలిచ్.

గెరసిమ్ చిరునవ్వు నవ్వి గదిలోనుంచి వెళ్ళబోయాడు. కాని ఇవాన్ఇలిచ్ వెళ్ళనివ్వలేదు. అతను దగ్గిర వుండడం తనకెంతో సుఖంగా కనిపించింది.

'గెరసిమ్, మరో మరోచిన్నపని చేసిపెట్టు, ఆకుర్చీ ఇలా తీసుకురా! నాకాళ్ళకింద పెట్టు.' అన్నాడు.

గెరసిమ్ కుర్చీ తెచ్చి ఇవాన్ ఇలిచ్ కాళ్ళకింద పెట్టాడు. ఒకదిండుకూడా ఉంచాడు.

'గెరసిమ్ ఇప్పుడు నీకు పనుందా?'

'లేదయ్యా'

'ఇంకా యివ్వాళ ఏంపనులు చేయాలి?'

అన్నిపనులూ అయిపోయినాయి. రేపటికి కట్టెలు కొట్టాలి, అంతేనయ్యా.'

'కొంచెం నాకాళ్ళు ఎత్తి పట్టుకో.'

'అలాగేనయ్యా"

గెరసిమ్ అలా చేశాడు. ఇవాన్ ఇలిచ్కి కొంచెం నొప్పి తగ్గినట్టుగా ఉంది.

'మరి కట్టెలు కొట్టడం ఎలా!'

'తరవాత కొడతాను లెండి'

గెరసిమ్‌ను అలా తన కాళ్ళు ఎత్తుగ పట్టుకొని కూచో మన్నాడు ఇవాన్ ఇలిచ్. అలా వున్నపుడు అతనికిహాయిగా వున్నట్టనిపించింది.

తరువాత కూడా అప్పుడప్పుడూ గెరసిమ్‌ను పిలుస్తూ వుండేవాడు. గెరసిమ్‌తన కాళ్ళు పట్టుకుని కూచుంటూండే వాడు. అతనితో మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యడమంటే ఇవాన్ ఇలిచ్‌కి ఎంతో కష్టంగా ఉండేది. గెరసిం ఎంతో వినమ్రంగా హాయిగా మనస్ఫూర్తిగా ఈపనులన్నీ చేసే వాడు. ఇతరులఆరోగ్యం శక్తి, ఉత్సాహం అతనికిఅసహ్యం కలిగించేవిగాని గెరిసిం ఆరోగ్యం, శక్తి, అతనికి ఒక విధ మైన ఓదార్పు నిచ్చేవి.

తను చనిపోతున్నాడనీ మృత్యుముఖంగా ప్రయాణం చేస్తున్నాడని ఎవరూ గ్రహించడం లేదు. అందరూ తను ఊరికే జబ్బుగా ఉంటున్నాడను కుంటున్నారు. అంతే, మందు పుచ్చుకుని కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకుంటే జబ్బు నయమవుతుందని అనుకుంటున్నారు. ఇవాన్ ఇలిచ్‌కి ఈ అసత్యం, ఈ మోసం, మరీ బాధ కలగజేసింది. అతనికి ముఖ్యంగా బాధ కలిగించిన విషయం ఇది: అందరూ తమకు స్పష్టంగా తెలిసిన విషయాన్ని ఒప్పుకోకుండా ఉన్నారు. పైగా అతనితో ఆ విషయం కప్పిపుచ్చి అసత్యం చెప్పడా నికి చూస్తున్నారు. అంతే కాక, తన్నుకూడా ఆఅసత్యంలో పాలు పంచుకో మంటున్నారు. మృత్యువు తనని కబళించ

పోతున్న సంధ్యాసమయంలో వారు నటిస్తున్న ఈ కపట నాటకాలన్నీ అతన్ని మరీ బాధిస్తున్నాయి. 'అబద్ధాలు మానెయ్యండి! నేను చనిపోతున్నానని మీకూ నాకూ తెలుసు. ఇందులో దాపరికం ఏముంది. అవసరమైన అస త్యాలు కట్టిపెట్టండి' అని వారితో సూటిగా చెప్పేద్దా మను కుంటాడు. కాని అతనికి ధైర్యం చాలేది కాదు. తనదృష్టిలో భీకరంగా కనుపిస్తున్న మృత్యువు వాళ్ళ దృష్టిలో ఒకచిన్న సంఘటన లాగా కనుపిస్తోంది— ఎవరో డ్రాయింగ్ రూమ్ లోకి వచ్చి దుర్వాసన వెదజల్లినట్టు. ఎవరూ తనకోసం బాధ పడడం లేదు. తనస్థితి అర్థంచేసుకుని తనకు సానుభూతి చూపడం లేదు. అసలు అలాటి ఇచ్ఛకూడా లేదువాళ్ళకు. గెరసిమ్ ఒక్కడే తనదుస్థితి గమనించి తన్ను జాలిదలిచాడు. గెరసిమ్ దగ్గర ఉన్నప్పుడు తనకెంతో ఓదార్పుగా ఉండేది. ఎంతో హాయిగా ఉండేది. రాత్రి చాలా ప్రొద్దుపోయే వరకూ గెరసిమ్ తనదగ్గరే కూచునేవాడు. ఒకోసారి రాత్రంతా కూచునేవాడు. 'గెరసిమ్! ఇక వెళ్ళి పడుకో. ఎంతసేపు మేలుకుంటావు?' అనేవాడు ఇవాన్ ఇలిచ్.

'పరవాలేదయ్యా. తరువాత పడుకుంటాలెండి' అనే వాడు గెరసిమ్. ఒకోసారి, 'మీరు జబ్బుగా ఉన్నారు. మీరు ఆరోగ్యంగా ఉంటే మేలుకుంటానా? జబ్బుగా ఉన్నారు కాబట్టి మేలుకుంటున్నాను' అనేవాడు. గెరసిమ్ ఒక్కడే నిజం చెప్పాడు. గెరసిమ్ ఒక్కడే అబద్ధం ఆడలా. ఇతరుల లాగా అతను ముసుగు వేసుకోలేదు.

శుష్కించి బలహీనంగా ఉన్న తన యజమానిని అత నొక్కడే జాలి దలిచాడు. ఒకమాటు ఇవాన్ ఇలిచ్ అతన్ని పంపిస్తూ ఉండగా, 'అందరం చనిపోయే వాళ్ళమేనయ్యా. కాస్త కష్టపడితే ఏం పోయింది?' అన్నాడు. అంటే తనపని తనొక బరువుగా భావించడం లేదన్నమాట, మరణశయ్యపై ఉన్న ఒక జీవికి తను సేవ చేస్తున్నాడు కాబట్టి తనకూ ఒక నాటికి అలాటిస్థితి వస్తుందనీ, తనకూ ఎవరో ఒకరు అలాగే సేవ చేస్తారనీ భావిస్తున్నా డన్నమాట.

ఇవాన్ ఇలిచ్ ఆశించినట్టుగా అతన్ని ఎవరూ జాలి తలచడంలేదు. ఒక్కోసారిఅతనికి బాధమరీ ఎక్కువయ్యేది. అలాటిక్షణాలలో ఒక శిశువును తల్లి జాలితలచి నట్టుగా తన్ను ఇతరులు జాలితలచా లనిపించేది. అతను పెద్దవాడనీ అతని జుట్టునెరుస్తూవుందనీకూడా అతనికి తెలుసు. అయినా అలా అనుకోకుండా ఉండగలిగే వాడు కాదు. గెరసిమ్‌తనకు చేసేసేవలో తనఆశ కొంతవరకు నెరవేరేది. ఇవాన్ఇలిచ్‌కి ఒక్కోసారి ఎవరిఒళ్ళోనైనా తలఉంచి ఏడుద్దా మనిపించేది. ఈలోగా తన సహచరుడు షెబెక్ వచ్చేవాడు. షెబెక్ రాగానే ఏడవడానికిబదులు అతనిముఖంలోకి తీవ్రతవచ్చేది. ఏదో కోర్టునిర్ణయంవిషయంలో తగాదావచ్చేది. తనచుట్టూ ఆవరించిన ఈ అసత్యపు సాలీడుగూడు అతని కడపటి దినా లను మరింత విషపూరితం చేసింది.

# 8

తెల్లవారింది. తెల్లవారిందని అతనికి తెలుసు. గెరిసిమ్ వెళ్ళిపోయాడు. పీటర్ వచ్చి దీపాలు ఆర్పి కిటికీ తెరలు తీసి, గది మెల్లగా సర్దుతున్నాడు. ఇప్పుడు ఇవాన్ఇలీచ్‌కి అన్నీ ఒక రకంగానే కనుపిస్తున్నాయి. తెల్లవారినాఒకటే, ప్రొద్దు గూకినా ఒకటే. ఏరోజయినా ఒకటే. శుక్రవారమైనా ఒకటే. ఆదివారమైనా ఒకటే. తనలో ఒక్కక్షణమైనా ఆగకుండా సుడిగుండంలా తిరుగుతున్న మృత్యుబాధ ఒక్కటే అతనికి తెలుసు. తనజీవితం క్షీణదీపంలా తగ్గిపోవడం మాత్రమే అతనికి తెలుసు. ఇక రోజులతో వారాలతో నెలలతో పనేమిటి?

' టీ తీసుకుంటారా అయ్యా'

'అక్కర్లేదు.' అన్నాడు ఇవాన్ఇలీచ్, అతనుఅన్నీ క్రమ బద్ధంగా పెద్దమనుషుల గృహాల్లో సాగించినట్టు సాగించాలని యత్నిస్తున్నాడని భావిస్తూ.

'సోఫామీద కూచుంటారా? సార్'

ఇతను గది సర్దదామనుకుంటున్నాడు. నేను అసహ్యంగా అశుభ్రంగా ఉండడం వల్ల తనపనికి అడ్డుగావున్నట్టున్నాను. అనుకొని 'అక్కర్లేదు. నీవు వెళ్ళు.' అన్నాడు ఇవాన్ఇలీచ్.

అతను వెళ్ళి పోయాడు. ఇవాన్ఇలీచ్ ఏదో అడగబోయినట్లు చెయ్యిచాచాడు. పీటర్ దగ్గరకువచ్చి ఏంకావాలిసార్' అన్నాడు.

'నా గడియారం'

పీటర్ గడియారం తెచ్చి యిచ్చాడు. ఇవాన్ ఇలిచ్ గడియారం చూశాడు.

'ఎనిమిదిన్నర. అందరూ నిద్రలేచారా?'

'లేదయ్యా. అబ్బాయిగారు మాత్రం బడికి వెళ్ళారు. మీకు అవసరమయితే అమ్మగారు తమని లేపమని చెప్పారు. వెళ్ళి లేపమంటారా?'

'అవసరం లేదు. కొంచం టీ తీసుకురా.'

పీటర్ తలుపుదగ్గిరికి వెళ్ళాడు. ఇవాన్ ఇలిచ్ కి ఒంటరిగా ఉండడమంటే భయంవేసింది. పీటర్ ని మళ్ళీపిలిచి 'పీటర్ కొంచెం మందివ్వు' అన్నాడు.

ఒకస్పూన్ మందు పుచ్చుకున్నాడు.

'లాభంలేదు. అంతా అబద్ధం. మందు మరణం తప్పిస్తుందా?' అనుకున్నాడు. మళ్ళీ నొప్పి ప్రారంభించింది.

'అబ్బ! మళ్ళా నొప్పి' అనిమూలిగాడు. పీటర్ అతని వంక చూశాడు. 'ఏంలేదు వెళ్ళి టీ తీసుకురా' అన్నాడు ఇవాన్ ఇలిచ్.

పీటర్ బైటికి వెళ్ళాడు. ఇవాన్ ఇలిచ్ ఒంటరిగామిగిలి పోయాడు. బాధతో మూలుగుతున్నాడు. శారీరక బాధ కంటే మానసికబాధ ఎక్కువగా వుంది. కాలం స్తంభించి నట్లు కనుపిస్తోంది.

ప్రతిరోజూ ఒకవిధంగానే గడుస్తోంది. ప్రతి పగలూ ప్రతి రాత్రి ఒకలాగానే ఉన్నాయి. 'ఆవచ్చేదేదో త్వరగా

వస్తే' అనుకున్నాడు ఇవాన్ ఇలిచ్. 'మృత్యువు! చీకటి! అబ్బ! భరించలేను' అనుకున్నాడు.

పీటర్ టీ తీసుకుని తిరిగి వచ్చాడు. ఇవాన్ ఇలిచ్ అతని వంక గాభరాతో చూచాడు అతనెవరో గుర్తించనట్టుగా.

'ఓ టీ తెచ్చావా? ఇలాపెట్టు. కొంచెం ముఖం కడుక్కొని కొత్త చొక్కా వేసుకోనీ!' అన్నాడు ఇవాన్ ఇలిచ్.

ఇవాన్ ఇలిచ్ పీటర్ సహాయంతో ముఖం కడుక్కోడం మొదలు పెట్టాడు. పండ్లుతోముకుని చేతులూ ముఖం కడుక్కొని తల దువ్వుకొని అద్దంలో చూచుకున్నాడు. అతని ముఖాన్ని చూచి అతనికే భయం కలిగింది. పాలిపోయిన తన నుదుటిమీద ఊచిపోయిన వెంట్రుకలు వ్రేలాడుతున్నాయి.

చొక్కా మార్చుకునేటప్పుడు భయంవల్ల శుష్కించిన తన దేహాన్ని తను చూచుకోలేక పోయాడు. దుస్తులు వేసుకోడం ముగించి టీ తీసుకోడానికి కుర్చీలో కూచున్నాడు. ఒక క్షణంపాటు హాయిగా ఉన్నట్టనిపించింది. టీ తాగడం మొదలెట్టగానే మళ్ళీ అరుచి ప్రారంభమైంది. నొప్పికూడా మొదలెట్టింది. ఎంతో కష్టంమీద టీ ముగించి కుర్చీలో పడుకుని పీటర్‌ను వెళ్ళమన్నాడు.

ఎప్పుడూ ఇంతే. ఒకక్షణం పాటు ఆశ మిణుగురు పురుగల్లే మెరుస్తుంది. మళ్ళీచీకటి, బాధ. ఎప్పుడూ ఇంతే. ఒంటరిగా ఉన్నప్పుడు ఎవరినైనా పిలుద్దామనిపిస్తుంది.

పిలిస్తే బాధ ఎక్కువవుతుందని మళ్ళీ పిలవడు. 'ఏంలాభం లేదు. ఇక లాభం లేదు' అనుకున్నాడు ఇవాన్ ఇలిచ్.

ఒక గంట ఇలా గడుస్తుంది. తలుపుదగ్గర గంట మోగుతుంది. డాక్టర్ వస్తాడు. ఆరోగ్యంగా హాయిగా శుభ్రంగా కులాసాగా నవ్వుతూ కనుపిస్తూఉంటాడు డాక్టర్.

'నీవు ఏదో విషయాన్ని గురించి భయపడుతున్నావు. నీకు అపాయం లేకుండా మేము చూస్తాం' అన్నట్టుగా తన వంక చూస్తాడు.

డాక్టర్ చేతులు రుద్దుకుంటాడు. 'అబ్బ! ఎంతచలిగా ఉంది. మంచు తీవ్రంగా ఉంది. కాస్త వెచ్చ చేసుకోనీండి' అంటూ చేతులు రుద్దుకుంటాడు. తను జబ్బు నయంచెయ్య డానికి చేతులు రుద్దుకోడం ఒక్కటే తరువాయి అయినట్టుగా చేతులు రుద్దుకుని, 'సరే, ఇహ చెప్పండి, ఎలా ఉన్నారు?' అంటాడు తాపీగా.

ఇవాన్ ఇలిచ్ అతనివంక 'నీకు అబద్ధం చెప్పడానికి సిగ్గులేదూ?' అన్నట్టుగా చూస్తాడు. డాక్టర్ ఈ విషయం అర్థం చేసుకోడు. ఎప్పుడూ 'ఉన్నట్టే ఉంది. నొప్పితగ్గలేదు' అంటాడు ఇవాన్ ఇలిచ్.

'అవును. మీరు రోగులెప్పుడూ ఇంతే. అమ్మయ్య! ఇప్పుడు కాస్త వెచ్చగా ఉంది. సరే. గుడ్ మార్నింగ్' అంటాడు డాక్టర్ రోగితో కరస్పర్శ చేస్తూ.

తరువాత, తను కులాసాగా ఉండడం మానేసి గంభీర మైన ముఖంతో రోగిని పరీక్షించడం మొదలెడతాడు. నాడి

చూస్తాడు. టెంపరేచర్ తీసుకుంటాడు. తరువాత గుండె పరీక్ష.

ఇవాన్ ఇలీచ్ కి యిదంతా వట్టి మోసమనీ అర్థరహిత మైందని తెలుసు. కాని అతను ఈ గొడవంతా సహించక తప్పదు. డాక్టర్ మోకాళ్ళమీద నుంచి అతనిపైకి వంగి స్టెతస్కోప్ పైకీ కిందికి తిప్పుతూ సర్కస్ ఫీట్లు చేస్తోంటే ఏమీ అనడానికి వీల్లేదు. కోర్టులో ప్లీడర్ల ఉపన్యాసాలు సహనంతో విన్నట్లే దీన్నంతా ఓర్చుకోవాలి.

డాక్టర్ అతన్ని పరీక్ష చేస్తూఉండగా ప్రాస్కోవ్యా ఫెడరోవ్నా సిల్కు దుస్తులు రాచుకుంటూ అక్కడికి వచ్చింది. డాక్టర్ వచ్చాడని ఎందుకు చెప్పలేదని పీటర్ను కేక లేస్తోంది.

ఆమె లోపలికి రాగానే భర్తను ముద్దాడి, తను నిద్ర లేచి చాలా సేపయినా, డాక్టర్ వచ్చాడని పీటర్ చెప్పక పోబట్టి తను రావడం ఆలస్యమయిందని రుజువు చెయ్యడానికి పూనుకుంటుంది.

ఇవాన్ ఇలీచ్ ఆమెను తేరిపార చూస్తాడు. ఆమె తెల్లగా మిలమిల లాడుతోంది. కొంచెం బొద్దుగా ఉంది. చేతులూ, మెడ, జుట్టు శుభ్రంగా మెరిసిపోతున్నాయి. ఆమె ముగ్ధ నయనాల్లో అదోవిధమైన తళుకు కనువిస్తోంది, ఆమెను చూడగానే అతనికి అసహ్యం కలుగుతుంది. ఆమె తాకినా సహించలేక పోతాడు.

అతని పట్ల అతని జబ్బుపట్ల ఆమె దృష్టి పూర్వం లాగానే ఉంది. మార్పేమీ లేదు. డాక్టర్ అతనిపట్ల ఒక దృష్టి అవలంబించి నట్లే ఆమెకూడా ఒక దృష్టి అవలంబించింది. అతను చెయ్యవలసిన పని చెయ్యడం లేదనీ, లేకపోతే జబ్బు ఎప్పుడో నయమై వుండేదనీ తప్పంతా అతనిదేననీ ఆమె ఉద్దేశం.

'చూశారూ– నామాట విని సరిగా మందు పుచ్చుకోడు. అదీ కాక తనకు ప్రమాదకరమైన పద్ధతిలో పడుకుంటాడు.' అన్నది డాక్టర్‌తో, అతను గెరసిమ్ చేత కాళ్ళు ఎత్తుగా పెట్టించుకొని పడుకున్న పద్ధతి చెబుతూ.

డాక్టర్ నవ్వుతూ 'రోగులంతే. ఏంచేస్తాం' అన్నాడు.

పరీక్ష పూర్తి కాగానే డాక్టర్ గడియారం వంక చూచుకున్నాడు. తరువాత ప్రాస్కొ–వ్యా ఫెడరోవ్‌నా మరో స్పెషలిస్టును పిలిపిస్తున్నాననీ, అతను వచ్చి ఇవాన్ ఇలిచ్‌ని పరీక్షించి మామూలు డాక్టర్‌తో సంప్రదించి మందిస్తాడనీ చెప్పింది.

'మీరు అడ్డు చెప్పకండి. ఇది నాకోసమే చేస్తున్నాను. అన్నది వ్యంగ్యంగా. నిజానికి అంతా అతనికోసమే చేస్తున్నట్టూ, అతను ఎదురు చెప్పడానికి వీల్లేకుండా ఉండే ఉద్దేశంతో. ఇక చేసేది లేక ఇవాన్ ఇలిచ్ మాట్లాడకుండా ఊరుకున్నాడు. తనుపూడుకోబోయిన బురదగుంటలోనుంచి తనింక లేవడం దుస్సాధ్య మనుకున్నాడు.

అంతా తనకోసమే అయినట్టు నటిస్తోంది, ప్రాస్కోవ్యా ఫెడరోవ్నా.

పన్నెండు గంటలయ్యే సరికి స్పెషలిస్ట్ వచ్చాడు. మళ్ళీ పరీక్ష మొదలెట్టాడు. గర్భాశయాన్ని గురించి చర్చలు కూడా మొదలైనాయి. ప్రశ్నలూ జవాబులూ— అన్నీ జరిగిపోయాయి. అసలు ఇప్పుడు అతన్ని ఎదుర్కొంటున్న జీవన్మరణ ప్రశ్నకు మారుగా గార్భాశయం, ఎపెండిక్స్ వీటినిగురించి ప్రశ్నలు.

స్పెషలిస్ట్ అతనివంక గంభీరంగా చూస్తూ శలవు తీసుకుని వెళ్ళాడు.

ఇవాన్ ఇలిచ్ కళ్ళల్లో భయం, ఆశ రెండూ కనుపించాయి. 'జబ్బు నయమవుతుందా?' అని భయంతో అడిగాడు. తనుగట్టిగా నయమవుతుందని వాగ్దానం చెయ్య లేక పోయినా, నయం కావడం దుస్సాధ్యం కాదన్నాడు డాక్టర్. ఇవాన్ ఇలిచ్ అప్పుడు డాక్టర్ వంక చూచిన చూపుఎంతో కరుణాత్మకంగా ఉంది. ప్రాస్కోవ్యా ఫెడరోవ్నా కూడా ఏడ్చింది. తరువాత బైటకు వెళ్ళి డాక్టర్ కు ఫీజిచ్చింది.

డాక్టర్ కలిగించిన ఆశ ఎక్కువసేపు వుండలేదు. ఒక క్షణకాలం మొలకెత్తిన ఆశ అంతరించి పోయింది. మళ్ళీ, అదేగది, అవే చిత్రాలు, అవే కర్టెన్లు, మందు సీసాలు, బాధ, మూలుగు, అన్నీ కనుపించసాగాయి. మత్తు ఇంజక్షనిచ్చారు. ఇవాన్ ఇలిచ్ విస్మృతిలో మునిగిపోయాడు.

అతను మళ్ళీ స్మృతిలోకి వచ్చేసరికి సాయంకాల మయింది.

భోజనం తెచ్చిపెట్టారు. కొద్దిగా భోజనం చేసి కాస్త టీ తాగాడు. మళ్ళీ చీకటి పడుతోంది,

భోజనం తరువాత ఏడు గంటలకు ప్రాస్కోవ్యా ఫెడరోవ్‌నా గదిలోకి వచ్చింది. బాడీ బిగించుకోడం వల్ల నిండైన ఆమె వక్షస్థలం ముందుకు ఎగదట్టుకుని ఉంది. ముఖాన పౌడర్ సాయంకాలపు దుస్తుల్లో అందంగా కను పిస్తోంది. ప్రొద్దున్నే థియేటర్‌కు వెడుతున్నామని అతనితో చెప్పింది. సారా బెరన్‌హా ఆవూరు వస్తోంది. ప్రాస్కోవ్యా ఫెడరోవ్‌నా థియేటర్‌లో బాక్స్ బుక్ చేసుకుంది. ఆమె ముస్తాబు ఇవాన్ ఇలిచ్‌కి అసహ్యం కలిగించింది. కాని, తన అసహ్యాన్ని దాచుకున్నాడు.

పిల్లలకు విజ్ఞానదాయకంగా ఉంటుందని తనే బాక్స్ బుక్ చెయ్యమని చెప్పాడు. ఆ విషయం జ్ఞాపకం వచ్చేసరికి అతని కిమరీవిసుగు కలిగింది. కాని విసుగు పైకి చూపించలా.

ప్రాస్కోవ్యా ఫేడరోవ్‌నా లోపలికి వచ్చి అతని క్షేమసమాచారాలు విచారించింది.

'ఒంట్లో ఎలాఉంది? నొప్పి తగ్గిందా?' అనిఅడిగింది. తన క్షేమసమాచారాలు ఊరికే విచారించడం కోసం విచా రిస్తున్నదని, నిజంగా తన జబ్బుస్థితి తెలుసుకోడానికి కాదని తన జబ్బు ఎలాగో నయంకాదని ఆమెకు తెలుసనీ ఇవాన్ ఇలిచ్‌కి తెలుసు. తరువాత ప్రాస్కోవ్యా ఫెడరోవ్‌నా,

నేనసలు వెళ్ళేదాన్ని కాదండీ. కాని, అప్పుడే బాక్సు రిజర్వు చేయించారు. హెలెన్ మన అమ్మాయీ పోతు న్నారు. పెట్రిషేవ్ (వారి అమ్మాయిని ప్రేమిస్తున్న మాజిస్ట్రేటు) కూడా వస్తున్నాడు వాళ్ళు ఒంటరిగా వెళ్ళడం బాగుండదు. నేను వెళ్ళివస్తాను. అంతవరకూ శాస్త్ర డాక్టర్ చెప్పినట్లు ఉండండి' అని తన మామూలు గొడవ చెప్పింది.

'అదుగో, ఫెడార్ పెట్రవిచ్, లీసా వచ్చారు. లోప లికి రమ్మననా?'

'సరే'

కూతురు లోపలికి వచ్చింది. సాయంకాలపు దుస్తులు ధరించి చక్కగా ముస్తాబైంది. ఆమె శరీరం మిసమిసలాడు తోంది. దుస్తుల్లోగుండా, బలంగా, ఆరోగ్యకరంగా ప్రణ యోద్దీపకంగా కనుపిస్తోంది. అనారోగ్యాన్ని దుఃఖాన్ని ఆమె సమీపించే స్థితిలో లేదు.

ఫెడార్ పెట్రొవిచ్ కూడా సాయంకాలపు దుస్తులు వేసుకుని వచ్చాడు. జుట్టుచక్కగా దువ్వుకున్నాడు. గంజి పెట్టి నిక్కపొడుచుకుని వున్న కాలర్ అతని మెడచుట్టు అందంగా కనుపిస్తోంది. కాళ్ళకు అంటుకొని పోయే నల్లని పంట్లాం వేసుకున్నాడు. చేతులో ఒపెరా హ్యాట్ పట్టుకుని ఉన్నాడు.

అతని వెలకాలే ఇవాన్ఇలిచ్ కొడుకు మెల్లగా వచ్చాడు. కొత్త దుస్తులు వేసుకున్నాడు. అతని కళ్ళకింద నల్లని నీడలు ఘోరంగా కనిపిస్తున్నాయి.

అలా ఎందుకు కనిపిస్తున్నాడో ఇవాన్ ఇలిచ్‌కి బాగా తెలుసు.

తనకొడుకును చూచినప్పుడల్లా అతనికి జాలికలిగేది. ఇప్పుడు ఆక్రుూరాడి భయాతురమైన చూపులు చూస్తుంటే మరీజాలికలుగుతోంది. గెరసిమ్ కాక వాస్యా ఒక్కడే తనను అర్థంచేసుకుని జాలి తలుస్తున్నాడని ఇవాన్ ఇలిచ్ అను కున్నాడు.

మళ్ళీఅందరూ తన కెలాఉన్నదని అడిగారు. కాసేపు అందరూ మౌనంగా ఉన్నారు. లీసా తనతల్లిని ఒపెరాగ్లాసుల కోసం అడిగింది. దాని విషయంలో తల్లీ కూతుళ్ళకు ఒక చిన్న చర్చ జరిగింది.

ఫెడార్ పెట్రోవిచ్-ఇవాన్ ఇలిచ్‌ని, 'మీరు సారా బెరన్‌హోను చూచారా?' అని అడిగాడు. ఇవాన్ ఇలిచ్‌కి మొదట్లో ఆ ప్రశ్న అర్థంకాలేదు. తరువాత గ్రహించి 'లేదు నువ్వు చూచావా?' అన్నాడు.

'చూశాను.'

ప్రాస్కోవ్యాఫెడరోవ్‌నా సారాబెరన్‌హో అద్భుతంగా అభినయించిన కొన్నిపాత్రలనుగురించి చెప్పింది. తన కూతు రు ఆవిషయం ఒప్పుకోలేదు. ఇద్దరికీ ఆమె నటనలోని వాస్త వికతను గురించి చర్చ వచ్చింది. ఎప్పుడూ ఇలాటి చర్చ మామూలే.

ఈచర్చ జరుగుతూ ఉండగా ఫెడార్ పెట్రోవిచ్ ఇవాన్ ఇలిచ్ వంక చూచి మాట్లాడడం మానేశాడు.

అందరూ అలాగే చేశారు. ఇవాన్ ఇలిచ్ మెరుస్తున్న కళ్ళతో శూన్యంగా చూస్తున్నాడు. వాళ్ళ చర్చ అతనికి కోపకారణ మైందని అతని చూపుల్లో స్పష్ట మవుతోంది. నిశ్శబ్దం బరువుగా ఉంది. అందరూ మాట్లాడకుండా కూచు న్నారు. కాసేపటి వరకూ ఎవరికీ మాట్లాడే ధైర్యం చాల లేదు. మోసం బైటపడి నిజం బట్టబయ లవుతుందని అందరికీ తేటతెల్లమవుతుందని భయ పడ్డారు. లీసా మొట్ట మొదట కొంచెం ధైర్యం తెచ్చుకుని ఆ బరువైన నిశ్శబ్దానికి భంగం కలిగించింది.

'మనం వెళ్ళదలుచుకుంటే వెంటనే బయలుదేరాలి.' అన్నది, తండ్రి బహుమతిగా యిచ్చిన రిస్ట్ వాచ్ చూచు కుంటూ. ఇలా అంటూ, ఫెడార్ పెట్రొలిచ్ వంక చూచి చిరు నవ్వు నవ్వింది. ఆనవ్వులో అర్థం వారిద్దరికే తెలుసు అంద రూ లేచి బయలుదేరారు.

వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత ఇవాన్ ఇలిచ్ కి హా యిగా వున్నట్టనిపించింది. వాళ్ళతో పాటు అసత్యం కూడా అక్కడినుంచి వెళ్ళినట్టుతోచింది. కానిఅతనితో అతని బాధ మాత్రం మిగిలిపోయింది. ఆ బాధ, ఆభయం అన్నీ నిర్జీవంగా కనుపించేలా చేస్తున్నవి. అన్నీ అసహ్యంగా కనుపిస్తున్నవి.

నిమిషాలు గడుస్తున్నాయి. గంటలుగా మారిపోతు న్నాయి. అన్నీ యథాప్రకారంగానే ఉన్నాయి. చరమా వస్థ మరింత భీకరంగా కనుపిస్తోంది. పీటర్ లోపలికి వచ్చి ఏదో అడిగాడు. 'గెరసిమ్‌ను పంపు' అన్నాడు ఇవాన్ ఇలిచ్.

# 9

భార్య ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రి చాలా ఆలస్యమైంది. మెల్లగా అడుగులు వేసుకుంటూ గదిలోకి వచ్చింది. ఇవాన్ ఇలిచ్ కి ఆమె అడుగుల చప్పుడు వినిపించి కళ్లు తెరిచాడు. కాని ఆమెఅని తెలీగానే అసహ్యంతో వెంటనే మూసుకున్నాడు. ఆమె గెరసిమ్‌ను పంపేసి తనే కూచుందామనుకుంది. కాని ఇవాన్ ఇలిచ్, 'అక్కర్లేదు. నీవు వెళ్ళు' అన్నాడు.

'మీకు చాలా బాధగా ఉందా?'

'ఎప్పుడూ ఇంతే'

'కొంచెం నల్లమందు పుచ్చుకోండి.'

అతను సరేనని కొంచెం నల్లమందు పుచ్చుకున్నాడు. ఆమె వెళ్ళిపోయింది.

రాత్రి మూడుగంటల వరకూ మైకంలో పడుకున్నాడు. ఆ మైకంలోకూడా ఎంతో బాధ. తననూ, తన నొప్పినీ ఒక ఇరుకైన గోనెసంచీలో తోసి కుట్టినట్టనిపించింది ఇవాన్ ఇలిచ్ కి. ఆ గోనెసంచీలో నుంచి తప్పించుకోడానికి అతను యమయాతన పడతాడు. కాని తప్పించుకోలేడు. దానికే లొంగిపోతాడు. ఈ విపరీతమైన బాధతో రాత్రంతా గడిపాడు ఇవాన్ ఇలిచ్. ఇలా పోరాడగా పోరాడగా హఠాత్తుగా స్మృతి వచ్చింది. కళ్ళు తెరిచిచూచాడు. గెరసిమ్ కాళ్ళ దగ్గర కూచుని కునుకు తీస్తున్నాడు. దీపం మెల్లగా తగ్గిపోతోంది.

'వెళ్ళు గెరసిమ్' అన్నాడు ఇవాన్ ఇలిచ్.

'పరవాలేదయ్యా,'

'కాదు. వెళ్ళు.'

ఇవాన్ ఇలిచ్ అతని బుజాలపై నుంచి తన కాళ్ళు తీశాడు. తనమీద తనకు ఎక్కడలేని జాలీ కలిగింది. గెరసిమ్ వెళ్ళేవరకూ వేచిఉన్నాడు. గెరసిమ్ వెళ్ళగానే వెక్కి వెక్కి ఏడ్చాడు పసిపిల్లాడిలాగా. తనింత నిస్సహాయుడనని, తనకు నా అనుకునేవాళ్లు ఎవరూ లేరని, మానవుని దయాహీనతా, ఈశ్వరుని నిర్దయా జ్ఞాపకం తెచ్చుకుని ఏడ్చాడు. ఈశ్వరుడు లేడనుకున్నాడు.

'ఇదంతా ఎందుకు చేశావు? ఈ ప్రపంచంలో నన్నెందుకు పడేశావు? నన్నెందుకు ఇలా బాధపెట్టి పీల్చి పిప్పిచేస్తావు?' అని రోదించసాగాడు.

ఈ ప్రశ్నలకు ఎవరు సమాధానం చెబుతారూ? ఎవరూ చెప్పరని ఇవాన్ ఇలిచ్ కి తెలుసు. ఈ ప్రశ్నలకు సమాధానం లేదని అతను మరీ తీవ్రంగా విలపించాడు. 'ఎందుకు నన్నిలా చేశావు? బాధపెట్టు—మరీ బాధపెట్టు.' అనిఏడ్చాడు.

తరువాత నెమ్మదిగా ఏడుపు మానేశాడు. ఏడుపు మెల్లగా తగ్గిపోయింది. అతనిలో ఊపిరి కూడా సలపనంత స్తబ్ధత కూడుకుంది. అతనిలో ఒక నిశ్శబ్దత, ఒక విధమైన నిశ్చలత ఏర్పడ్డాయి. ఆ నిశ్శబ్దంలో నుంచి ఏదో గొంతుక వింటున్నట్టు తన అంతరాత్మ వాక్కు వింటున్నట్టూ అనిపించింది.

'అసలు నీకు కావలసిందేమిటి?' మొదటి గొంతు అడిగింది.

'ఏం కావాలి? ఏం కావాలి?' అనుకున్నాడతను.

'నాకేం కావాలి? బ్రతకాలి. కాని బాధపడకూడదు.' సమాధానం చెప్పాడు.

'బ్రతుకు! ఎలాంటి బ్రతుకు?'—గొంతుక అడిగింది.

ఇదివరకు నేను బ్రతికినలాంటి బ్రతుకు. హాయైన బ్రతుకు.'— సమాధానం చెప్పాడు.

'పూర్వం నీవు బ్రతికిన బ్రతుకు! హాయైన బ్రతుకు!' ప్రతిధ్వనించింది గొంతుక.

అతని భావనా జగత్తులో తన పూర్వ జీవితమంతా ప్రత్యక్షమైంది.

తను జీవితంలో సుఖంగా గడిపిన క్షణాలన్నీ కళ్ళ ముందు కట్టాయి. కాని విచిత్ర మేమిటంటే ఇప్పుడా సుఖ క్షణాలు తలుచుకుంటే అవి సుఖక్షణాలలాగా కనుపించడం లేదు. తన శైశవంనాటి కొన్ని స్మృతులు మాత్రమే సుఖ మయంగా కనుపిస్తున్నాయి. శైశవంలో నిజంగా అతను కొంత సుఖం అనుభవించాడు. ఆ రోజులు మళ్ళీ వస్తే! పిచ్చి ఊహ. ఆ సుఖం అనుభవించిన శైశవం ఎప్పుడో గతించి పోయింది. ఆ శిశువు చనిపోయాడు. అది ఎవరో మరో వ్యక్తి అనుభూతిలా కనుపిస్తోంది.

శైశవం గతించింది. తరువాత అన్నీ దుఃఖాలే. సుఖాలు కావు. సుఖాల్లా కనుపిస్తాయి. అంతే. ప్రతి సుఖం

వెనక ఒక భీకరమైన అనుమానం ఆ వేదన ఇమిడి ఉంటాయి. శైశవం తరువాత మరో ఇవాన్ ఇలిచ్ అయిపోయాడు. ఇప్పుడు మిగిలింది అతనే.

ఈ అనుమానాలు ఆవేదనలు, 'లా' చదువుతో మొదలెట్టాయి. తరువాత అతను ఉద్యోగంలో ప్రవేశించిన మొదటి రోజులు జ్ఞాపకం వచ్చాయి. ఆ రోజుల్లో కూడా కొన్ని సుఖక్షణాలున్నాయి. కొన్ని ప్రణయ స్మృతులు. తరువాత, రానురాను సుఖమయమైన జ్ఞాపకాలన్నీ మాసిపోయాయి. క్షీణించిపోయాయి. జీవిత స్మృతిపథంలో పోయే కొద్దీ సుఖం తగ్గిపోతున్నట్టు కనుపించసాగింది. తన వివాహం అనుకోకుండా జరిగిన ఒక సంఘటన. వివాహం చేసుకున్నాడు. కాని తను ఊహించిన సుఖం సంసారంలో పొందలేదు. తన భార్య— ఆమె కపటత్వం- దుర్వాసన- అతి కాముకత- అన్నీ జ్ఞాపకం వచ్చాయి. తరువాత తన ఉద్యోగ జీవితం—ఎన్ని సంవత్సరాలు గడిచినా అదే ఉద్యోగం. అవే పనులు. అవే డబ్బు గొడవలు. జీవితం ఒక కొండ మీదినుంచి క్రిందికి—ఎక్కడికో అగాధమైన లోతులోకి జారుతున్నట్టుగా అని పిస్తోంది. కాని నేను పైకి పోతున్నట్టుగా ఊహించాను అనుకున్నాడు ఇవాన్ ఇలిచ్. ఇతరుల దృష్టిలో పైకి పోతున్నట్టు కనుపించింది.

కాని అసలు ప్రతిక్షణం క్రిందికి జారాడు. అంతా అయిపోయింది. ఇక మిగిలింది ఒక్క మృత్యువే.

ఇవాన్ ఇలిచ్‌కి ఇదంతా అయోమయంగా కన్పించింది. 'ఇదేమిటి! జీవితమంతా ఇంత నిరర్థకంగా కనుపిస్తోంది!

ఇంత భీకరంగా కనుపిస్తోంది. ఈ బ్రతుకుకూ చావుకూ అర్థం లేదా? బాధతో మరణించడమేనా జీవితానికి చరమగమ్యం' అనుకున్నాడు ఇవాన్ ఇలిచ్.

'నేను జీవించ వలసిన విధంగా జీవించి ఉండను' అని పించింది అతనికి. మళ్ళీ, 'జీవితంలో అన్ని బాధ్యతలూ నిర్వ ర్తించాను.' అని తనకు తాను సమాధానం చెప్పుకున్నాడు.

జీవించాల్సిన విధంగానే జీవించాననుకున్నాడు.

తనను ఎదుర్కొంటున్న జీవన్మరణ సమస్యలన్నిటిని పరిష్కరించడానికి అసాధ్యమైన విషయాలుగా పరిగణించి అవతలికి తోసేశాడు.

'అయితే నీవు కోరేదేమిటి? బ్రతుకు. ఎలాటి బ్రతుకు? నీ కోర్టుల్లో బ్రతికిన బ్రతుకు లాంటిదేనా?'

'జడ్జీగారొస్తున్నారు.' అని సేవకుడు ప్రకటిస్తాడు. నీవు కోర్టులో ప్రవేశిస్తావు. నేరస్థుణ్ణి విచారిస్తావు. శిక్షవిధి స్తావు. 'నేరం చేశావని నీవు, చెయ్యలేదని నేరస్థుడు. ఇదే నా జీవితం!–' అడిగింది గొంతుక.

ఇవాన్ ఇలిచ్ కి సమాధానం తోచలేదు. ఒక ప్రక్కకు తిరిగి పడుకుని 'ఎందుకొచ్చింది ఇదంతా?' అని ఆలోచించ సాగాడు.

జీవించాల్సిన పద్ధతిలో జీవించక పోవడం వల్ల ఈ గొడవంతా వచ్చిందని సమాధానం స్ఫురిస్తే, తన జీవితం బాగానే ఉందనుకుని ఆ సమాధానాన్ని విస్మరించేవాడు.

# 10

మరో పక్షం రోజులు గడిచాయి. ఇప్పుడు ఇవాన్ ఇలిచ్ సోఫాలోనే పడివుంటున్నాడు. ఒక్క క్షణంకూడా సోఫా వదలి పెట్టడం లేదు. గోడవంక శూన్యదృక్కులతో చూస్తూ సోఫాలోనే కూచుంటాడు. అహరహాలూ! 'దీనికంతా, అర్థం ఏమిటి?' అన్నే ప్రశ్న విచారిస్తూ కూచుంటాడు.

దీనికంతా అర్థం మృత్యువని పిస్తుంది.

'అవును. మృత్యువేన'ంటుంది అంతర్వాణి.

'ఎందు కీబాధంతా?'

'కారణంలేదు. అంతే అది. ముందూ వెనక ఏమీ లేదు. అంతాశూన్యం.'

జబ్బు మొదలైనప్పటి నుంచీ ఇవాన్ఇలిచ్‌కి రెండు రకాలైన మానసిక అవస్థలు: ఒకప్పుడు దుఃఖం. చావు ఎప్పుడొస్తుందా అని వేచుకుని కూచునేవాడు. మరొకప్పుడు ఆశ. తన జబ్బు ఎలా నయమవుతుందా అని శరీరావయవాల పరిణామాన్ని పరిశీలించేవాడు. ఈ రెండు భావాలూ అతని కళ్ళముందు ఒకదాని తరువాత ఒకటి నృత్యం చేసేవి.

తరువాత రోజుల్లో ఇవాన్ఇలిచ్‌ని ఒక నిరవధికమైన ఏకాంతం ఆవరించింది. సోఫాలో ఒంటిగా పడుకొనేవాడు. చుట్టూ అనేక జనం నివసిస్తున్న నగరం సజీవంగా పొంగిపోతోంది. అతని కెందరో స్నేహితులు ఉన్నారు. కాని ఎవ్వరూ లేనట్టుగా అనుకునేవాడు. ఈ శూన్య ప్రపం

చంలో తనొక్కడే జీవిస్తున్నట్టని పించేది. ఈ దుర్భరమైన ఒంటరి తనం అతన్ని ఆవరించింది. సముద్రగర్భంలో, భూమి అట్టడుగునా, ఉండే ఒంటరితనం లాంటిదది. ఇవాన్ ఇలిచ్ ఈ ఒంటరితనంలో తన గత జీవితస్మృతులు తలచు కుంటూ పడుండేవాడు.

తన గతజీవితమంతా సినిమా బొమ్మల్లా అతనికళ్ళ ముందు కనుపించేది. ఒకొక్క బొమ్మవచ్చి కాసేపాడి అదృశ్యమయ్యేది. గత జీవిత స్మృతులన్నీ ఇలా ఆడి ఆడి చివరకు శైశవ స్మృతిలో నిలిచిపోయేవి. తనను పెంచిన నర్సు, తన అన్న, తను ఆడుకున్న బొమ్మలు—ఎన్నో విషయాలు జ్ఞాపకం వచ్చేవి.

'అబ్బ! భరించలేను' అనుకుని ఆ స్మృతులన్నీ మరిచి పోయి ప్రస్తుతాన్ని గురించి ఆలోచిద్దామనుకునే వాడు ఇవాన్ ఇలిచ్. తను పడుకున్న సోఫాను గురించి ఆలో చించడం మొదలెట్టేవాడు. మళ్ళీ అతని మనస్సు చిన్న నాటి స్మృతుల పైకి వెళ్ళేది. అతనికి ఆ స్మృతులు ఎంతో బాధ కలిగించేవి.

మళ్ళీ తనజబ్బు ఎలాపుట్టిందో ఎలా పెరిగిందో నానా టికీ అతను ఎలా క్షీణించి పోయాడో ఆలోచించడం మొద లెట్టేవాడు. తన జబ్బు నానాటికీ హెచ్చినట్టుగానే తన జీవితం క్షీణిస్తూ వచ్చింది. 'ఎక్కడో దూరాన మొదట్లో ఒక వెలుగు రేఖ—ఒక రే—కనుపిస్తోంది. తరువాత అంతానలుపు. అంతా చీకటి. ఆ వెలుగురేఖ జీవిత ప్రారంభంలో. అంతే తరువాత చీకటి' అనుకునేవాడు. రానురాను హెచ్చుతున్న

వేగంతో ఆకాశంనుంచి క్రిందికి పడుతున్న రాయి జ్ఞాపకం వచ్చేది. ఆ వేగంతో తనజీవిత పతనాన్నిపోల్చుకునేవాడు.

'ఇక సహించలేను. ఈ బాధకు అర్థం? అది తెలిస్తే-కాని ఎలా తెలుస్తుంది? నేను సరిగా జీవించలేదా? జీవించాను' అనుకునేవాడు. తను ఎంత మర్యాదగా న్యాయ సమ్మతంగా జీవించాడో జ్ఞాపకంవచ్చేది. వ్యంగ్యంగా నవ్వుకునే వాడు.

# 11

ఇలా మరో రెండు వారాలు గడిచాయి. ఆ పక్షం రోజుల్లో ఒక సంఘటన జరిగింది. అది తనకూ తనభార్యకు అభిమతం కూడా. పెట్రోలిచ్ తన కుమార్తెను పెండ్లాడతానని ఒక సాయంత్రం ప్రాస్కో వ్యా ఫెడరోవ్నా తో చెప్పాడు. మరుసటి రోజు ఆమె తన భర్తకు ఈవార్త చెప్పాలని గదిలోనికి వచ్చింది, కాని ఆరాత్రే అతనిపరిస్థితి మామూలుకంటే హీనంగా దిగజారింది. ఆమెగదిలోకివచ్చి చూచే సరికి అతను సోఫా మీద పడుకుని మూలుగుతున్నాడు. శూన్యంగా చూస్తున్నాడు.

మందు విషయం జ్ఞాపకం చెయ్య బోయింది. కాని ఆమె చెప్పేలోగానే భీకరంగా చూస్తూ 'అబ్బ! దయచేసి నన్ను శాంతంగా చనిపోనీ' అన్నాడు. ఆచూపులో ఆమెకు ఎంతో జుగుప్స, అసహ్యం, కనుపించాయి.

అతను ఈమాట్లు అన్నతరువాత ఆమె వెళ్ళిపోయేదే. కాని ఈలోగా కూతురు వచ్చింది. తన భార్య వంక చూచి

నల్లే కూతురివంకకూడా చూచాడు. ఆరోగ్యం ఎలావుందని ఆమె ప్రశ్నిస్తే కొద్దిలోనే తనబాధఅందరికితప్పిస్తానన్నాడు. ఇద్దరూ కాసేపు మౌనంగా కూచుని వెళ్ళిపోయారు.

'అనవసరంగా మనల్ని అంటాడేమిటి? మన తప్పే ముందీ?' అన్నది లీసా.

మామూలు సమయానికి డాక్టర్ వచ్చాడు. డాక్టర్ ప్రశ్నలకు ఇవాన్ఇలిచ్ జవాబులు చెప్పాడు. డాక్టర్ వంక కూడా కోపంతో చూచాడు. చివరకు 'నీవు నాకు ఏమీ చెయ్యలేవు. దయచేసి నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళు.' అన్నాడు.

'కొంచెం బాధ తగ్గిస్తాను' అన్నాడు డాక్టర్

'అదీ చెయ్యలేవు.'

డాక్టర్ డ్రాయింగ్ రూంలోకి వెళ్ళి జబ్బుముదిరిందనీ, నల్లమందు తప్ప మరో గతిలేదనీ, ప్రాస్కోవ్యా ఫెడరోవ్నా తో చెప్పాడు.

ఇవాన్ఇలిచ్ శరీరం మనసూ రెండూ దుర్భరంగా బాధపడిపోతున్నాయి.

అతని మానసిక యాతనకు ముఖ్య కారణం ఇది: అతను గత రాత్రి ప్రశాంతంగా ఉన్న గెరసిమ్ ముఖం చూచినప్పుడు ' నా బ్రతుకంతా తప్పు దోవలో నడిచివుండ గూడదా?' అన్న సందేహం వచ్చింది.

ఈ సందేహం అతన్ని పీడించసాగింది. తన బాధ్యతలు, తన ఉద్యోగ వ్యవహారాలు, తన జీవితవిధానం, తన

కుటుంబ జీవితం, తను నివసించిన సంఘవ్యవస్థ అంతా తప్పేమోనన్న సందేహం కలిగింది. వాటిని సమర్థించి లాభం లేదనుకున్నాడు.

ఇవాన్ ఇలిచ్ తన జీవితాన్ని మరోదృష్టితో సమీక్షించుకోడం మొదలెట్టాడు. ఉదయాన్నే లేచినతరువాత, తను తనసేవకుణ్ణి చూచినప్పుడు, తరువాత భార్యా కూతుళ్ళను చూచినప్పుడు, డాక్టర్‌ను చూచినప్పుడు, వాళ్ళ మాటలు వాళ్ళ ప్రవర్తన వాళ్ళ మాటలు అన్నీ తన అనుమానం నిజమేననీ తను గతరాత్రి తెలుసుకున్నదే సత్యమని రుజువు చేస్తున్నాయి. వారిలో ధ్వంసమైన తనజీవితపు ప్రతిబింబం చూస్తున్నాడు. తనజీవితం అసత్యమనీ తను ఇంత కాలం ఒక పెద్ద మోసంలో బతికాడని స్పష్టపడుతోంది ఇవాన్ ఇలిచ్ బాధతో మూలిగాడు. అతనికి బ్రతుకనా బంధువులన్నా, భార్యాబిడ్డలన్నా, సంఘమన్నా, అసహ్యం కలిగింది.

నల్లమందు పుచ్చుకుని నిద్రపోయాడు. కాని మధ్యాహ్నమయ్యేసరికి బాధ ప్రారంభించింది. గదిలోకి ఎవ్వరినీ రానివ్వలేదు. అందరినీ వెళ్ళమన్నాడు. అటూ ఇటూ పొర్లుతూ పడుకున్నాడు.

భార్య దగ్గరకు వచ్చి 'నామాట విని ఒక్క పని చెయ్యండి. •అందరూ చేస్తారు. ఇందులో వచ్చిన నష్టమేమీ లేదు.' అన్నది. అతను కళ్ళు తెరచి 'అనవసరం' అన్నాడు. ఆమె ఏడవడం మొదలుపెట్టింది.

'సరే' అన్నాడు.

'మతగురువును పిలిపిస్తాను.' అన్నది భార్య.

మతగురువు వచ్చాడు. అతని పాపనివేదనం విన్నాడు. ఇవాన్ ఇలిచ్‌కి హృదయం స్వచ్ఛమైనట్టు తోచింది. ఒక క్షణం ఏదో ఆశాకిరణం కనుపించింది.

పాప నివేదనం తరువాత భార్య వచ్చి 'ఇప్పుడెలా వుంది? కొంచెం హాయిగా వుంది కదూ!' అన్నది.

'అవును.' అన్నాడు.

ఆమె దుస్తులు, విగ్రహం, ఆమె ముఖంలోని భావాలు ఆమె కంఠస్వరం, అన్నీ అతనికి ఒకే సత్యాన్ని ఉద్బోధించాయి. 'నీవు జీవించిన పద్ధతి తప్పు. నీవు మోసంలో బతికావు అని. ఈ సత్యం అతనికి స్ఫురించగానే అతని బాధ, మానసిక యాతనా ఇనుమడించాయి. ఆమెవంక సూటిగా చూస్తూ ' వెళ్ళు నన్ను వదలి వెళ్ళు' అన్నాడు.

# 12

మూడురోజులు తీవ్రంగా మూలుగుతూ పడున్నాడు. గది తలుపులు మూసిఉన్నా బైటికి భయంకరంగా వినిపించేవి మూల్గులు. తన సందేహాలు తీరలేదు. కాని అంతిమ క్షణాలు సమీపించాయి.

మూడురోజులూ భయంకరంగా గడిచాయి. యమ యాతన అనుభవించాడు. ఉరిశిక్ష విధింప బడిన నేరస్థుడు ఉరి తీశేవాని చేతుల్లో చిక్కినట్టు యాతన పడ్డాడు. ఇక

గత్యంతరం లేదు. మృత్యువు—తన్ను ఇంతకాలం భయపెట్టిన మృత్యువు దగ్గరకు వస్తోంది. ఏదో అదృశ్యశక్తి తన్ను తోసిన ఆ చీకటి సంచీలో ఇరుక్కుని గిలగిల లాడిపోయాడు.

హఠాత్తుగా అతన్ని ఏదోశక్తి హృదయంమీద కొట్టి నట్టయింది. తను ఇరుక్కున్న చీకటిరంధ్రం కొసలోపడ్డాడు. ఆ అడుగులో ఒక వెలుగు కనుపించింది. ఒక్కోమాటు రైలుపెట్టెలో కూచుని రైలు ముందుకు పోతోంటే వెనక్కు పోతోందనుకుంటాం. కాని వెంటనే ముందుకే పోతుందని గ్రహిస్తాం, అప్పుడు అలా అనిపించింది ఇవాన్ ఇలిచ్‌కి.

'అవును. నా జీవితం తప్పే. మరి మంచి ఏమిటి?' అనుకున్నాడు. తన్నుతాను ఇలా ప్రశ్నించుకున్న తరువాత ఒక విధమైన శాంతి కుదిరింది.

మూడోరోజు తను ఇక రెండు గంటలకు మరణిస్తా డనగా ఈ ప్రశ్న వేసుకోడం, ఈ శాంతి కుదరడం జరిగింది. ఈ లోగా అతని కొడుకు దగ్గరకు వచ్చాడు. తనచెయ్యి ముద్దెట్టుకుంటూ ఏడవసాగాడు.

ఆక్షణంలోనే ఇవాన్ఇలిచ్ వెలుగును చూడగలి గాడు. 'మంచి అంటే ఏమిటి' అని ప్రశ్నించుకున్నాడు. ఎవరో తనచేయి ముద్దాతూ వుండడం గమనించి కళ్ళు తెరచి చూచాడు. తనకొడుకు కనుపించాడు. అతనికి జాలి కలిగింది.

తన భార్య కూడా వచ్చింది. ఆమె బుగ్గల మీద కన్నీటి ధారలు కనుపిస్తున్నాయి. అతనికి ఆమెపై కూడ జాలి కలిగింది.

'అవును. నేను వాళ్ళకు బాధకలిగిస్తున్నాను. పాపం! నేను పోతేనైనా సుఖిస్తారు.' అనుకున్నాడు. ఇలా చెబుదా మనుకున్నాడు. కాని చెప్పే శక్తి చాలలేదు. తన భార్య వంక చూచి కొడుకుని తీసుకుని వెళ్ళమని సైగ చేశాడు.

'వీణ్ణి తీసుకెళ్ళు. పాపం తు... ...మిం... ...' అన బోయాడు.

ఇంత కాలం అతన్ని పీడించిన బరువూ బాధా అదృశ్య మవుతున్నట్టు తోచింది. వాళ్ళకోసం అతను విచారిస్తు న్నాడు. వాళ్ళకు బాధ కలిగేలా ప్రవర్తించడు. ఇకవాళ్లకు విముక్తి లభిస్తుంది.

'ఇప్పుడెంత హాయిగా ఉంది.' అనుకున్నాడు.

'బాధ! బాధ ఏదీ?'

'మృత్యువు! ఏదీ?'

అతనికి కనుపించలేదు. ఇప్పుడు భయంలేదు. ఇప్పుడు మృత్యువు లేదు. ఆ స్థానంలో జ్యోతి వెలుగుతోంది.

'ఎంత ఆనందం!!

ఇదంతా ఒక్క-క్షణంతో జరిగింది. అతని గొంతులో ఏదో కొట్టుకున్నట్టుంది. శరీరం చుట్టలు తిరిగింది.

'అయిపోతూంది' అన్నారు ఎవరో. అతనీమాటలు విన్నాడు. తనలో పునశ్చరించుకున్నాడు.

'మృత్యువుకే ఇది ఆఖరు' అనుకున్నాడు.

—౦—